గంగాధరరామశాస్త్రి, శొంఠి

శ్రీకృష్ణలీలాశుకము - చింతామణి

రాజమండ్రి, 1923

Record no. 312

Gaṅgādhararāmaśāstri, Śoṇṭhi

Śrīkṛṣṇalīlāśukamu - Cintāmaṇi

Rājamaṇḍri, 1923

Record no. 312

## Bibliographic Record Target

గంగాధరరామశాస్త్రి, శొంఠి.

శ్రీకృష్ణలీలాశుకము - చింతామణి / గ్రంథకర్త శొంఠి గంగాధరరామశాస్త్రి.- 1. కూర్పు.- రాజమండ్రి : కే. యల్. యన్. సోమయాజులు, 1923.

(1), 106 p. ;20 cm.

Record no. 312

Gaṅgādhararāmaśāstri, Śoṇṭhi.

Śrīkṛṣṇalīlāśukamu - Cintāmaṇi / granthakarta Śoṇṭhi Gaṅgādhararāmaśāstri.- 1. kūrpu.- Rājamaṇḍri : Kē. Yal. Yan. Sōmayājulu, 1923.

(1), 106 p. ;20 cm.

Record no. 312

# SRI KRISHNA LEELASUKA.

# చింతామణి

గ్రంథకర్త

...శాస్త్రి.



కె. యల్. యస్. సోమయాజులు

ప్రొప్రయిటరు, గోదావరీబుక్కుడిపో,

రాజమండ్రి.

1928.

వెల. 1—0—0.

# జాతకమర్మబోధిని.

బ్రహ్మశ్రీ కాలనాథభట్ట వేంకటరమణశాస్త్రి[illegible] విరచితము, జ్యోతిషము నభ్యసింపగోరువారు నీగ్రంథమును పఠించిన ద్వాదశభావములు కరతలామలకముగా తేట తెల్లమగుననుట [illegible] సంశయములేదు. అనేక గ్రంథములనుండి విషయాంశములు [illegible] తేట తెల్లముగా నుదాహరణములతో వ్రాయబడినవి. [illegible]గ్రంథములు చదువనవసరము లేకుండునట్లుండును. వెల రూ. [illegible]-4-0

# అగ్గిరాముడు.

—:)o(:—

రామమూర్తి గారు

జిల్లానంతయు గగ్గోలుపెట్టి దండనాధికారుల కెన్నియో సాహసములు ప్రత్యక్షమగుచు మోసపుచ్చి తనకు గొండుభుజబలములనందరు దొంగరాముడు బలేరాముడు అనువారలతో నీగజదొంగయొనర్చిన సాహసములు వర్ణింపనలవికాదు. అగ్గిరాముని పేరును వినని సాహసకృత్యములును వినని వారుండరు. సుమారు కొన్ని సంవత్సరములకు పూర్వము జిల్లాలో అగ్గిరాముడు ఒనర్చినచర్యల నాబాల గోపాలము గాథలక్రింద చెప్పుకొనెడివారు కానియితడెచ్చటను మనుష్యులకు ఎంతమాత్రము వానికగపించలేదు. నీచకృత్యము లొనర్చినను అగ్గిరాముని ధైర్యశక్తి [illegible] శరీరపాటవమునకు అక్కజపడని వారుండరు. ఇంగ్లీషుభాషలో వ్రాయబడిన పరిశోధకగాథల ననుసరించి వ్రాయబడినది.

వెల. రూ. 0-10-0

ప్రొప్రయిటరు, గోదావరీ బుక్కుడిపో, రాజమండ్రి.

శ్రీరామ

శ్రీకృష్ణలీలాశుకము,

# చింతామణి.

గ్రంథకర్త

కొంతి గంగాధరరామశాస్త్రి





ప్రకాశకుడు

కే. యల్. యస్. సోమయాజులు
ప్రొప్రయిటరు, గోదావరీబుక్కుడిపో.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

రాజమండ్రి.

యస్. గున్నేశ్వరరావు బ్రదర్సు[illegible]
శ్రీ చింతామణిముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1923.

వెల. 1—0—0.



శ్రీరామచంద్ర!

# శ్రీకృష్ణలీలాశుకము.

## ప్రథమాంకము.

### రంగము—పూఁదోఁట.

(ఇరువురు పురుషులొక పెట్టెతోఁ బ్రవేశింతురు)

మొద—అబ్బా! ఇంక నెంతదూర మున్నది?

రెండ—బాగుగ నున్నది. పొలిమేర నైన దాఁటకుండఁగనే దూరప్రమాణమును లెక్కించుచుంటివేమి? మన మిప్పుడే వామనమూర్తిగారి యారామవాటికం బ్రవేశించితిమి. ఇక్కడకు సరిగ మూఁడుక్రోశము లుండును.

మొద—అయ్యో! నే నంత దవ్వు నడువఁగల్గుదునా? ఇంచుకసే పెందైన గూరుచుండి తరువాత బోవుదము.

రెండ—ఇందుకొఱకే నిన్ను రావలదని చెప్పితిని. నా మాట వినవైతివి కదా!

మొద—నీవు శ్రమ నొందుచుండ నే నింట సుఖింపఁగల్గుదునా? నాకు మాత్ర మేమి తోఁచును? కష్టసుఖము లిరువురమును సమానముగ ననుభవింపవలసినదే.

రెండ—కానిమ్ము! జరగినదాని కాలోచింప నేమిలాభము? [illegible]వైనా, మృత్యువైనా సంభవింపక తప్పదు. ఈ సమీపమున నొక విహారవేదిక యున్నది. దానిపై నించుక విశ్రాంతిఁ దీర్చికొని పోవుదము నడువుము. (అరుగును సమీపింతురు.)

రెండ——(పెట్టె యరఁగునఁ బెట్టును.)

మొద——(అరఁగునఁ గూరుచుండి) అబ్బా! ఈస్వల్పదూరము నడచుటకే యింత కష్టముగ నున్నదికదా, మూఁడుక్రోశముల నున్న నాగావళి నెట్లు చేరఁగల్గుదును?

రెండ——(నవ్వుచు)

సీ. సిగపూలు తొలఁగించి వగ పాగ ధరియించి
కోరమీసము దీర్చి కులుకఁగలవె?
మొలనూలు నెడలించి మొలధట్టి బిగియించి
తరవారి చేఁ దాల్చి మురియఁగలవె?
కంఠహారము ద్రోసి కాలసూచిని వైచి
నిల్వునామము దిద్దనేర్వఁగలవె?
పాదభూషల దుల్చి పాపోసులం దాల్చి
కన్నద్దములఁ బెట్టి క్రాలఁగలవె?
పురుషునింబోలి వేషంబుఁ బూనవచ్చు
చెలఁగి యుద్యోగ మేదైనఁ జేయవచ్చు
నలుగులం దాల్చి శత్రుల నదమవచ్చుఁ
గాని, పౌరుష మెట్టులఁ గాంతు వతివ!

మొద——చాలు! నీ యెకసక్కెముల కేమిలే! రాత్రినుండియు నన్నుఁ జూచినపుడెల్ల నీకు పరిహసించుటయే పనియైయున్నది. దైవవశంబున నెవ్వరెవ్వరైన మనజాడ గుర్తింతురేమో యనుసంశయమున నీవే నన్నీ వేషముం దాల్పఁజేసి తుద కిట్లుపహసింతువా? అంతేకను నా కర్మ మటు లుండ నిన్ననవలసిన దేమున్నది?

(మొగము ముడుచును.)



రెండ——ప్రియసఖీ! ఎంతలో నవ్వులు పువ్వులను జేసితివి? పరిహాసవాక్యముల కిట్లు కోపింపఁ దగునా?

శా. నీ సింగారము, నీ యొయ్యారము, వగల్, నీయోరచూపుల్ మమ్ముం
గాసింబెట్టి సుమాయుధాగ్నిశిఖలం గన్నారఁగాఁ ద్రోసెదున్
రోసంబెంచ కనుగ్రహించి సతి! నాతో నుల్లసం బాడుమా!
దాసుం డెట్టి మహాపరాధుఁ డయినన్ దండింపఁడే ఱేఁ డిలన్.

అట్లే నీవును నా యపరాధమునకై శిక్షింపవలసినదే. నీహస్తపల్లవములు కనలిపోకుండ నా చెంపపైఁ గొట్టుము. నీ పదకంజము వాడకుండ నా శిరమున దన్నుము. సంశయింపకుము. నీ వధికారిణివి; నేను సేవకుఁడను. లేక, నన్ను గరుణింపఁదలఁతువేని, నీ స్మేరానన రాకాసుధాకరబింబమును సాక్షాత్కరింపఁజేసి నా నేత్రచకోరముల కమృతదానం బిచ్చి రక్షింపుము.

మొద——అబ్బా! మిత్రమా! వలదన్నకొలఁదియును బరిహాసింతువు గదా! ఇవేటిమాటలు! నే నధికారిణిని, నీవు సేవకుఁడవునా? పరిహాసమునకు సమయాసమయము లాలోచింపవుగదా! అకటా! నా హృదయ మాందోళనము జెందుచున్న దేమి చేయుదును?

రెండ——కావుననే, యిట్లు పరిహాసభాషణముల మఱపించుచుంటిని.

మొద——అన్నియు నసత్యములే. నా మనోవైకల్యము నీ వెట్లు గ్రహింపఁగల్గితివి చెప్పుము?

రెండ——ఓసి వెఱ్ఱిదానా! ఎట్టి నిరర్థకప్రశ్నమును వైచితివి? నా హృదయేశ్వరి మనోవిచారము నాక కాక యన్యులకెట్లు బోధపడఁగును?

మొద—(ముందు జూచి) అయ్యయ్యో! దూరమున నెవ్వరో యిటు వచ్చుచున్నటులఁ గానఁబడుచున్నది. మన కిప్పు డేమిగతి! అదిగో! సమీపించుచున్నారు; పోవుదము రమ్ము. (అరఁగు దిగును.)

రెండ—(నవ్వి) ఓవిభీతహరిణేక్షణా! నీ దృష్టిభ్రమణమే గాని, యిం దీ ప్రభాతమున నే వచ్చువా రెవ్వ రుందురు? అయిన న దేమందువేని,

ఉ. మాసినచేలముల్ విడచి మల్లెలఁబోలు మడుంగుదోవతుల్
వాసి ధరించి తళ్కుచు నువారమునం దమ కోడకానికై
గాసెకు పొత్తుటాండ్రవలె గంపెడుపూవులు మేనదాల్చి యా
భాసురమూర్తికై యెదిరి భాసిలు సుందరవల్లికాతతుల్

మొద — (నవ్వుచు) వగకాఁడా! నీవు వచించిన యుపమాన మనుపమానముగ నున్నది. దీనివలన నీకు వెలయాండ్ర యనుభవముం గూడ నున్నటుల స్పష్ట మగుచున్నదే! అటులనా? ఇంతకాలమునుండియు నేలచెప్పవైతివి? సరియే! నిన్ను నమ్మినందుకుఁ దగినప్రాయశ్చిత్తము చేసితివి? చాలుఁజాలు నీక నన్నంటక దూరముగఁ బొమ్ము!
(దూరమున నిలుచును.)

రెండ—(సమీపించి గడ్డము బట్టి) మాటిమాటికి నిట్లు కోపించిన నాకు బ్రదుకుతెరు వెయ్యది?

సీ. నీ మూలమున గదా నిఖిలసుక్షేత్రముల్
తృణసమమ్ముగ నెంచి త్రెంచినాఁడ
నీ మోహమున గదా నీతిగాదని పిన్న
నాఁటియొట్టును నిల్పి నడచినాఁడ
నీ ప్రేమమునగదా నెయ్యుల నెడఁబాసి
వనభూమి నీ వెంట వచ్చినాఁడ



నీ ప్రాపుననుగదా నెలఁత నొల్లక రోసి
నీ యిష్ట సఖుఁడనై నిలిచినాఁడ
భుక్తి ముక్తియు, భోగానురక్తి వీవె
కష్టసుఖముల భాగ్యభోగ్యంబు లీవె
యిహపరంబుల కర్మంబు లెంచ నీవె
యింత లేటికి? నీవె నే నేనె నీవు.

మొద—మిత్రమా! నీకు నా యెడ నెట్టియనురాగమున్నదియో తెలిసికొనలేకపోయితిననియా, యింతగ నొక్కి వక్కాణించితివి! సరియే! నాకు నీ యెడ నెట్టి భక్తివిశ్వాసము లున్నవో, యెట్టి మమకార మున్నదో నీవు మాత్రము గ్రహింపఁగల్గితివా? కాని,నీ వలె వర్ణించుటకు నేను గవితాసామర్థ్య మున్నదానఁ గాను.

రెండ—నీవు వేఱుగ వర్ణింపనక్కఱలేదు. నా మనస్సాక్షియే నాకుఁ బ్రమాణము.

గీ. మొలకనవ్వులు నీమోము దళుకులీనఁ
బ్రేమడోలిక నూగాడు నా మనంబు
అట్టె గ్రక్కునఁ బెడమోము బెట్టితేని
నాడు లన్నియు నవశమై మోడు నగుదు.

మొద—ఔరా! వేశ్యానుభవ మున్నదనినందుల కెంత యుపన్యాస మిచ్చితివి? కాని, మిత్రుఁడా! బాలకాండ మరణ్యకాండములోనికి మరలించి తుదకు సుందరకాండముగ మార్చితివే!

రెండ—ఇది లోకాభిరామాయణము గాని, వాల్మీకిరామాయణము గాదు. దీనికి నిర్యాణకాండముతోఁ గథాసమాప్తికిఁ బ్రతిబంధకమై యున్నది.

మొద—(గద్గదస్వరమున) హా! నీ కడసారిమాట విన్నతోడనే నా హృదయమున బిడుగువడిన ట్లయినది. కనులు చీఁకటులు గ్రమ్ముచున్నవి. కాలసర్ప మానఖశిఖపర్యంతము గఱచివైచుచున్నది. స్మృతి తప్పిపోవుచున్నది. అకటా! నేటితో మూఁడేండ్లును పెంచిన ప్రేమ ముక్కలైపోవుచున్నదికదా! కడుపుశోకమునకుఁ గాలప్రమాణము లేదు. అనుభవింపక తప్పదు. ఇదియంతయు నీయందలి వ్యామోహము-నా ప్రారబ్ధము—అయ్యో! ఇంకేమిగతి! నీ వెంత మఱపించి నన్ను మనసు స్వస్థతఁ జెందకున్నది. హా! దైవమా! నాబ్రతుకి దేమాయమైపోయినది.

[తెరలో]

ఉ. ఎవ్వఁడ వోరి నీవు మది నింతయు భీతి జనింపకుండ [illegible]
పువ్వులతోఁట సొచ్చి తెటు పోయెదు ప్రాణము జిక్కఁబట్టి నా
చివ్వ చవిం గనుంగొనఁగఁ జిత్తముపుట్టెనె! కాచికొమ్ము నీ
క్రొవ్వడఁగింతు నీఋణము గొల్లున నీ తలిదండ్రు లేడ్వఁగన్.

మొద—(భయము నటించి) అయ్యో! ఎవ్వరో యిటే వచ్చుచున్నారింకేమిదారి! నే నెంత చెప్పినను నామాట యరణ్యరోదనమైపోయినదిగాని, వినవైతివిగదా!

రెండ—మన కిప్పుడు పేటికతోఁ బరుగిడ సాధ్యము గాదు. కర్తృతంత్ర మెట్లున్న నట్లగును. సర్వమునకు దైవమే, కల్యడు. రమ్ము పోవుదము. (నిష్క్రమింతురు)

మొద—అయ్యో! నన్ను విడచి పోవుచున్నారే. నేమిచేయుదును! ఎందు బోవుదును!

(పరుగిడఁబోయి క్రిందఁబడి మరల లేచి నిష్క్రమించును)



[వామనమూర్తి ప్రవేశించును.]

వామ—(కోపమున) ఓరోరి పారుఁబోతా! ఎందుఁ బోయెదవురా? ఓరీ! మాధవా! వేగముగ రమ్ము; దొంగలు పాఱిపోవుచున్నారు.

మాధ—(కన్నులు నులిమికొనుచుఁ బ్రవేశించి) ఏటి బాబూ! సుక్కొడిసినా కిప్పుడు దొంగలేటిబాబూ! నాను తెలిగేసే తొంగుడున్నాను. కట్టిగిత్త, యెల్లవెయ్య, కమ్ములాడుతుండాయేమో!

వామ—చీ! యభాగ్యుఁడా! పోయిచూడక యిక్కడనే యాకాశపంచాంగము జెప్పెదవేమిరా?

మాధ—సిత్తంబాబయ్యా! సూసొత్తానుండి. (నలువైపులఁ బరికించి) అయ్యాగోరండీ! దొంగోళ్లే! దొంగోళ్లే! ఎక్కడో పెట్టెత్తుకొచ్చి మీగు గూకుడుండే యరఁగుమీఁదెట్టినారు; బేగిరండి.

వామ—(ఆత్రముతో) ఆఁ! ఎక్కడెక్కడ? నడువుము చూచెదము. [ఇరువురు నరఁగును సమీపింతురు.]

వామ—(తనలో) ఆహా! ఏమియీవింత! నిజముగ నిక్షేపమే. కోరినకోర్కెలిచ్చు చింతామణియే-చోరులు దీనిం బ్రిద్దలు కొట్టుట కనువగుప్రదేశమొందును గానక యిటకుఁ దెచ్చియుందురు. పాప మీ ధనముం గోల్పోయిన మందభాగ్యుఁడెవ్వఁడోకదా!

చ: సిరియొకయుంటఁ గాఁపురము సేయఁగనొల్లదు; పెక్కుకాలము
దిరుగుచుఁ గొంపకొంపకును దివ్యుల పేదలఁ జేయుఁ బేదల
సిరిగలవారిఁ జేయు నతిచిత్రమి దేటి ముదంబొయీయామెకు
సరియగుఁగాదె పూర్వభవసంచిత మెవ్వఁడుద్రోసిపుచ్చెడున్.

ఆహా! ఈధన మెంతకాలమునుండి కూడఁబెట్టుచువచ్చెనో గాని, నేఁటికి ఱెక్కలువచ్చి యెగిరిపోవుచున్నది. ఇంతకును, నదృష్టవంతుని

తెలచువాఁడును, దురదృష్టవంతుని బాగుచేయువాఁడును గలఁడా? నేఁటికి నాయదృష్టవశమున నీభాగ్యదేవత నన్నుద్ధరింపవచ్చియుండె నేమో?

మాధ — బాబూ! ఆలోసిత్తారేంటి. ఇంటి కొట్టుకొని పోవాలెగుండి.

వామ—(ఆలోచననటించి, తనలో)

చ. ఎటుఁగొనిపోదు దీని, నిపు డేమికతంబున
భటునితలంపు వక్రిమయి పాల్గొనఁజూచిన నేమిసేతు, వా
కిటను మెలంగు తల్లి నెటు కేలను ద్రోయు దభాగ్యశాలినై
కటకట! వద్దునుం బెరుఁగు కల్పినయట్లులనుండె నెవ్వనిన్.

(తల పంకించి) బాగు! ఇదే యుపాయము. (ప్రకాశముగ) మాధవా! ఇందు సొమ్మే యున్నదో, దుమ్మే యున్నదో! బట్టలే యున్నవో, పాతలే యున్నవో! మనకేమియును దెలియదు. ఒకవేళ, నిజముగ ధనమే యున్నచో నీకుఁ దగినబహుమానమొసంగెద నీరహస్య మెవ్వరికిని దెలియనీయక మెల్లగ నీ పెట్టె నింటికిఁ దీసికొని పొమ్ము.

మాధ—సిత్తం బాబూ! సిన్నప్పటికాడనుండి, మీకూడుదిని, మీ బట్ట కట్టినాను. కొట్టినా మీరే-పెట్టినా మీరే. (ముందుఁజూచి) అయ్యగోరండీ! సానెమ్మ నెగిసొత్తున్నాది.

వామ—(తనలో) అయ్యో! కొంపమునిఁగినదిగదా! ఎన్ని కష్టములైనను దాఁటవచ్చుఁగాని, యీ మృత్యుదేవత బారినుండి తప్పించుకొనుట దుస్సాధ్యము. ఇప్పుడేమిచేయుదును! కానిమ్ము; ఏదేనొక మాయోపాయమున వెనుకకు మరలించుకొని పోవలయును. లేకున్న, నాయాలోచనమంతయు బూడిదలోఁబోసిన పన్నీరువలె నిరర్థకమగును.



[ధనరాజు ప్రవేశించును.]

వామ—(ఎదురేగి) ప్రియురాలా! ఆట నుండక యింతలో నీ వెందులకు వచ్చితివి?

ధన—చాలు మీ సహవాసము! నన్నొక్కతెను విడిచి వచ్చెదరా? నాగుండె లెట్లు కొట్టుకొనుచున్నవో చూడుఁడు. దీనికిఁ దోడు, మీరు మాధవునితో చోరుల సమాచారము గూడ ప్రశంసించినట్లు వినవచ్చిన దేమది?

వామ—(తనలో) ఇప్పుడు నేను నిజముగ మాటలలో దొంగనే కావలసివచ్చినది. లేకున్న గత్యంతరము లేదు. (ప్రకా) ఇంతమాత్రమున భీతిల్లవలయునా? అయినను, దెల్లవారు సమయమున దొంగ లెందుండి వత్తురని యైన నాలోచింపవలదా?

ధన—అబ్బా! ఇంత భయమైనచో నా ముప్పేటల గడనును చెవుమా!

వామ—ఎంత బేలవే! నేనున్నంతవఱ కెట్టిభయమైన నీకుఁ గలుగనిత్తునా? నీప్రాణమునకు నా ప్రాణ మడ్డువెట్టుదు ననుకొనుము.

ధన—ఆ! ఇప్పటి మాటలే. మగవారికి నేఁటి వలపులు రేపుండునా? వేయుగుళ్ల పూజరులు. పైకిఁ జెప్పున దొకటియును, మనసులోని తలంపు వేఱొకటియును. నే నెఱుఁగని సింగారములు గావు.

వామ—(తనలో) అహా! దీని వాక్కులయం దర్థాంతరము ధ్వనించుచున్నదే! కాదుకాదు. నా యనుమానమే నన్ను బాధించుచున్నది. (ప్ర) మనోహారిణీ! మాటలో, మాటలో నిడిపైపై నీకే తెలియఁగలదు. ఇఁక గృహమున కేగుదము నడువుము.

ధన—ఇంటికేగుట కంత తొందరేల? మరల జాము రాత్రికిఁ గాని మీ ముఖదర్శనమే లభింపదుకదా! చక్రవాక మిథునములవలె నెంతకాల మిట్లు గడపవలయునో తెలియకున్నది.

వామ — చెలీ! పెట్టెమాత్రమే యందుండునుగాని, సర్వదా నా నయనభృంగములు నీ వదనపంకజము నాశ్రయించియే యుండును సుమా!

ధన — క్రియాశూన్యమైన యీ శుష్కప్రియము లేమి యుపయోగము! ఇంతకును, మన కా దైవ మీ యపూర్వసంఘటనము మేలునకే చేసెనో, కీడునకే చేసెనో! కానున్నది కాకమానదు. ఒక్కింతసేపు వసంతవిలాసవేదికపై విశ్రమించి యీ ప్రభాతశీతవాతముల ననుభవింతము రండు.

వామ — (తనలో) అయ్యో! ఎంత రహస్యగోపనము జేసి మరలించుకొని పోవుదమన్నను వ్రేలితోఁ జూపిన ట్లక్కడకే పోవ సంకల్పించినదికదా!

ధన — యోజించుచుంటి రేమి? ఇంటి కేగుట కాలస్యమగుచున్నదనియా?

వామ — (తనలో) ఎట్లయినను వెల్లడి గాక మానదు. చేసిన తప్పును దిద్దికొనుటయే మంచిది. (పై) వగలాఁడీ!

ఉ. మాటలొ, మూటలో యవిక్రమంబున నీవె గ్రహింతువన్న నా
మాటలఁ బూటకంబులుగ మార్చి తలంచితివే మఱి; నీకె యీ
మాటనొసంగి నీ ప్రణయముగ్ధుఁడనై సుఖయింపనుండ నో
బోఁటిరో! నీవె గెల్చుకొనిపోతివి మాటయు, మానికంబునున్.

ధన — నాకు మీయర్థము బోధపడుట లేదు.

వామ — ఇప్పుడే తెలియఁగలదు నడువుము.

[అరఁగును సమీపింతురు.]

మాధ — (తనలో) అయ్యగోరు సానెమ్మబుట్టలో పడిపోనారు. దీనితదుట్టం బాగుండాది. దైభం నన్ను సానెమ్మనైనా సేసినాఁడు కాఁడు.



ధన — (పెట్టెచూచియాశ్చర్యమున) ప్రియా! ఇదేమి? ఈ పేటిక యిందుల కెట్లు వచ్చినది?

వామ — (నవ్వి) మాటయు, మాణిక్యముంగూడ నీవే దక్కించుకొంటివనిన దిందుకొఱకే. దీనిని నిజముగ దొంగ లెత్తికొనివచ్చిరి.

ధన — ఆఁ! ఎంతవింతగనున్నది!

వామ — వింత కేమున్నది? ఎవనికొంపదోఁచిరో! దీనిం బ్రద్దలు కొట్టుట కిష్టముగ ప్రదేశ మెందును గానక యిందులకుఁ దెచ్చియుండవచ్చును.

ధన — (తనలో) ఓహో! ఈతఁడు నక్కజిత్తు లుపదేశించుచుండెనే! అబ్బా! నన్నిట్లు మభ్యపఱచి దీనిం దక్కించుకొనిపోవలెనని యిన్ని పెడదారులు ద్రొక్కినాఁడు. కానీ! ముందింకను నేమిచెప్పునో వినియెదఁగాక! (పై) ఇంటికిఁ గొనిపోకుండ నెందుకీ యాలస్యము! ఉదయమైనచోఁ బ్రమాదము సంభవించునేమో!

వామ — నీవు చూచునిమిత్తమే యింతవఱకు కాపియుంటిని. (మాధవునితో) మాధవా! ఇంక జాగ్రత్తగఁ దీసికొనిపొమ్ము.

మాధ — సిత్తం బాబూ! (పెట్టెతో నిష్క్రమించును.)

ధన — ఎక్కడకుఁ గొంపోవును?

వామ — మఱెక్కడకు — నీ గృహమునకే.

ధన — (తనలో) ఈమాట సత్యమై యుండునా? కాదు కాదు. నమ్మవీలు లేదు. కుక్కకాటునకుఁ జెప్పుదెబ్బయే మందు. కావున, కార్యము చెడిపోకుండ ముందుగ మాధవుని గలసికొని నా వెంటఁదీసికొనిపోవలయును. (పైకి) మనోహరా! సూర్యోదయము కావచ్చుచున్నది. కొంతదూరము కలసియే పోవచ్చును. రండు.

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

## రెండవరంగము.

[సుందరుఁడు, గోపాలశర్మ ప్రవేశింతురు.]

సుంద—మిత్రమా! గోపాలశర్మా! నాల్గువత్సరము లైనను గాళిదాసత్రయమే ముగియలేదు కదా, యింకెన్నాఁడు నాతోఁ గలసి యలంకారగ్రంథములు చదువుదువోయి? దారపుత్రాదులను విడిచి యిల్లెంతకాల ముండఁగలవు?

గోపా—(తనలో) నీ విద్యాబుద్ధులు బ్రతికి బట్టగట్టినప్పుడు గదా మెప్పువడయుట! (ప్రకా) నేనును నీతోఁగూడ సిద్ధాంతకౌముది బ్రారంభించినచో మనమిరువురమును గలసి చదువుకొనవచ్చును.

సుంద—తక్కిన రెండు కావ్యములును బూర్తి కాకుండఁగనే ప్రారంభింతువా?

గోపా—అయిన నేమి?

సుంద—సాహిత్యబల ముండిననేగాని, శాస్త్రము బోధపడదు. కావున, నీవు సత్వరముగ భారవియును, మాఘమును బూర్తిచేసినచో నే నింతలోఁ గొన్ని యలంకారగ్రంథములు పఠించెదను. అటుపై వ్యాకరణశాస్త్రమున నిరువురమును సహాధ్యాయులము గావచ్చును.

గోపా—ఉపాధ్యాయునితో నీవట్లు చెప్పవలయును.

సుంద—అటులనే కాని, మిత్రమా! మన గురుపాదులు సకలైశ్వర్యసంపన్నులైనను, ననపత్యకారణమున మిగుల విచారగ్రస్తులై యుండిరి సుమా!

గోపా—ఓయి వెఱ్ఱివాఁడా! ఎంత దురభిప్రాయపడితివి? ఆయన కట్టి విచారమే యున్నయెడల భార్య మరణింపఁగనే పునర్వివాహము చేసికొనియుందురు. ఆర్జించువాఁ డెన్నఁడు ననుభవింపఁ బోఁడు, అందుల కెవ్వఁ డధికారి యై పుట్టియుండెనో!



సుంద—ఇదియా నీ తలంపు? ఇది కేవలము పొరబాటభిప్రాయము. ఏమన, మున్నొకనాఁ డొకమహనీయునితో దామోదరపండితులు పునర్వివాహప్రత్యవాయముం గూర్చి యిట్లు చెప్పియున్నారు వినుము.

"చ. సతి మరణింపఁ బూరుషులు సంసృతిఁ బొంది, కృపావిహీనులై
బ్రతుకుట హైన్య, మందుపయి భార్య మఱొక్కతెఁ జేసికొన్న దు
ర్గతి యొకఁ జెప్పఁగాఁ దరమె? గంతలుగట్టినగానుగెద్దులై
మతి చెడి యన్యముం గనక మ్రగ్గుదురు గాని సుఖింపనేర్తురే"

(తెరలో) సుందరా!

సుంద—మామ్మగారు వచ్చుచున్నారు. మన మిఁక పాఠశాలకుఁ బోవుదము.

[కామాక్షి చీపురుతో ప్రవేశించును.]

కామా—(గొంతెత్తి) దిక్కుమాలినచచ్చినాఁడా! ఎదిరి అమ్మమీఁదికుంపటివలె నీ వెందుకు నాకు దాపురించితివిరా? కంచములోఁ బిండాకుడు పెట్టికొని కూరుచుంటే యంకా లొట్టఘట్టియము వేద్చుచున్నావా, నీ బ్రతుకు మండ. [సుందరుని కొట్టును.]

సుం—(కనుల నీరు గ్రుక్కుకొని తనలో) హా! హా! విధీ! అమ్మా యని నోరార నేడ్చుటకైనను బెట్టిపుట్టనైతిఁగదా! గొంతెత్తి యేడ్చిన మఱింత కొట్టి బాధించును. ఏ ఘట మెంత చేసికొనియెనో, యంతయు ననుభవింపక తప్పదు. (ప్రకా) మామ్మా! నే నేమి యపరాధము జేసితిని?

కా—ఇంకను నపరాధ మేమని యడుగుచుంటివా? ఇది యన్నము దిని పాలమునఁ బొమ్మంటి నట్లు చేసితివా?

సుం—నేఁ డుదయముననే మా గురువులు వ్యాకరణముం బ్రారంభింప సుముహూర్త మేర్పఱచి యున్నారు. అందుచే—

కా—(కొట్టి) ఆ మాటయే యనవద్దు. నే జెప్పినపనియే నాకుఁ గావలయుఁ గాని, నీవు చదివిన నాకేమి, చచ్చిన నాకేమి?

సుం—(దోసి లొగ్గి) మామ్మా! నమస్కరించెద నీకుఁ గొట్టక నా మనవి వినుఁడు. పూజ్యులు తమ వత్సుల పురోభివృద్ధిని గోరి విద్యాబుద్ధులఁ గఱపింపఁ జూతురు గాని, యాగమ్మగాకివలె బాలముల వెంటఁ ద్రిప్పి పాడుచేసికొందురా? సకలముం దెలిసిన మీకు నేఁ జెప్పనంతటివాఁడనా?

కామా—అబ్బో! ఎంతవాఁడ వైతివి? నా కెదురు సెప్పుటయే గాక, శ్రీరంగనీతులఁ గూడ దిద్దుచుంటివిగా? అది నీతప్పు కాదు. ముందువచ్చు మొసల్లపండు గెలుఁగక, యాదిక్కుమాలినచచ్చినది నిన్ను నెత్తినెక్కించుకొనుచున్నది. నాకేమి? దానికర్మ మదేయనుభవించును.

[భవాని ప్రవేశించును.]

భవా—అమ్మా! అదేమే! నీ కేమి పోఁగాలము వచ్చినదే యాలాగున గొట్టితివి? రా! నా తండ్రీ! (సుందరుని దగ్గర దీసి) నేనెంత ప్రాకులాడిన నేమి? యెంత ప్రేమ జూపిన నేమి? పిల్లవాని బాగుఁ గోరి యెన్నఁడైన నేదే నొక మాట గట్టిగ ననునప్పటి కిరుగుపొరుగమ్మలక్కలు మూతులు త్రిప్పికొని, ముక్కులు విఱచికొని "సవతితల్లి పిల్లవానిని నానాబాధలఁ బెట్టుచున్న" దని యువ్వెత్తుగఁ జెప్పికొందురు. కాని, నిజము గ్రహింపరు గదా! పైని గంపంత కన్ను పెట్టికొని పరమాత్ముఁడు చూచుచునే యున్నాఁడు. లోకు లేమనుకొన్న నేమి? ఇంతకును, నెవరి కర్మమున కెవరు కర్తలు? ఇంకను ముందేమి యుకతలు నా నెత్తిని బడనున్నవో?



సుంద—అమ్మా! పిల్లల లోపములను మందలించుట పెద్దలకు విధాయకకృత్యమే కదా! లోప మున్నచోఁ గన్నతల్లిమాత్రము కనకాభిషేకము సేయునా?

ఉ. మంచియుఁ జెడ్డయుం గఱపి మక్కువఁ బెంచెడు తల్లిదండ్రు లొ
క్కించుక రైనఁ బుత్రకున కెగ్గు దలంతురె? యెన్నఁడైనఁ దాఁ
బెంచినభూరుహంబు నొకపెట్టున గూల్చెదుక్రూరు లుందురే
కంచెయె చేను మేయ నిఁకఁ గాఁపొనరించున దేమి యమ్మరో!

గోపా—(తనలో) ఆహా! ఏమి యీ చిత్రనాటకము!

కామా—అమ్మాయీ! లోకమునకు భయపడినయెడల మనకు నిలువ నీడయైన నుండునా? అట్లే యైనచో నీవఱకే నీ మగఁడు లోకులమాటలు విని మనకుఁ జిప్ప చేతి కిచ్చియుండును. అతఁ డట్టివాఁడు కాఁడు గనుక - ఆతని యాట లేమియు సాగనీకుంటిమి గనుక - ఇంత కలియో, గంజియో త్రాగి మర్యాదగ నొకమూల పడియుంటిమి. లేకున్న మన పాటు లడుగవలయునా? (సుందరునితో) ఓరీ! సుందిగా! ఇవ్వేళ నేఁ జెప్పినట్లు పొలమునకుఁ బోయి వెంకని నింటికంపకున్న నీ రక్తము బొట్టుపెట్టుకొని, పేగులు దీయించి మెడను వేసికొనకున్న నా పేరు కామాక్షి కాదు; జ్ఞప్తి నుంచికొనుము.

భవా—అబ్బా! పీడ వదలినదిరా నాయనా! గోపాలశర్మా! ఆ రండ వీని నెందులకుఁ గొట్టినదయ్యా?

గోపా—కేదారములకుఁ బోలేదని.

భవా—(స్వ) నా కిందలి కారణ మీవఱకే తెలియును. కాని, వీనికి నాయం దెట్టి యనుమానమును లేకుండునట్లు పైకేమియు నెఱుఁగనిదానివలెఁ గృత్రిమప్రేమము నటియించి పొలమునకుఁ బోవ నొప్పింపవలయును. (ప్ర) నాయనా! పొలమునకుఁ బోయినఁ జదువుకొను టెట్లు?

సుంద—చదు వక్కఱలేదనియే యామె యభిప్రాయము కాఁబోలు!

భవా—అయ్యో! దాని కేమి వినాశకాలము వచ్చినదికాక! చదు వక్కఱలేదనియే చెప్పినదా?

సుం—అట్టుల గాదు. "నేఁ జెప్పిన పనియే నాకుఁ గావలయుఁ గాని నీవు చదివిన నా కెందుకు, చచ్చిన నా కెందు?" కని తీవ్రముగఁ బల్కినది.

భవా—(స్వ) చదు వక్కఱలేదు గాని, చచ్చుట గావలసినదే. (ప్ర) ఇప్పు డేమి చెప్పఁబోయినను తక్కినవలె మీఁదఁ బడును. నాయనా! ఆ ముదుసలిముండతో మనకుఁ గయ్యమెందులకు? నా మాట విని నాల్గుదినములు ఉపాధ్యాయునికడ సెలవుదీసికొని పొలమునకుఁ బోయి వచ్చుచుండుము. ఇంతలో దాని తిక్కతిరిగినయెడల మరలఁ జదువుకొనవచ్చును.

సుంద—(తనలో) అమ్మగారు మాత్రము నాపై నెన్నఁడును కోపము చేసికొనరు. కాని, యప్పుడప్పుడు గొన్ని చిత్రకల్పనములఁ జేసి తండ్రిగారిచేఁ గొట్టించుచుండును. ఏమైన నేమి?

గీ. అమ్మ లేనిలోప మావంతయును లేకఁ
బ్రేమఁ జూచి నన్ను బెనుచుచుండె;
కన్నతండ్రికంటెఁ గరుణార్ద్రచిత్తయై
కన్నబిడ్డ పోల్కిఁ గాంచుచుండె.

(ప్ర) అమ్మా! నీ యాజ్ఞాప్రకార మట్లే చేసెదను. కాని, నాయనగారు—

భవా—నా తండ్రీ! ఆ భయము నీకు వలదు. నీ తండ్రిగారి నేదో యొకవిధముగ సమాధానపఱచెదను. నా మాట వినవయ్యా!



ఆ దిక్కుమాలినముండ నిన్ను గొట్టుచుండఁగఁ జూడఁజాలకుంటి నిరా బిడ్డా! ఎందుకు రవ్వఁబడెదవు? నే నెందుకుఁ జెప్పితినో నా మాట వినుము తండ్రీ!

గోపా—మిత్రుఁడా! ఆమె యంత దూరము వచించునప్పుడు నీ వామె యాజ్ఞ నతిక్రమించుట భావ్యము గాదు.

సుంద—అమ్మా! నీ యుపదేశానుసారముగ నవనతశిరస్కుఁడనై యొనరించెద. మిత్రమా! గోపాలశర్మా! మన యుపాధ్యాయులతో నాకు మాఱుగ సెలవును నివేదింపవలయును.

గోపా—ఓ! అందులకు సందేహ మేమి? నీ వా మాట చెప్పవలయునా?

సుంద—అమ్మా! పోయి వచ్చెదను.

భవా—మంచిది నాయనా! పొమ్ము.

సుంద—(నిష్క్రమించును.)

భవా—పోవుటయే గాని, వచ్చుట యెక్కడ?

గోపా—(నవ్వుచు) ఔరా! ఎంత విచిత్రనాటకమును గల్పించితివి?

భవా—(గోపాలుని కౌఁగిలించి) ఇది యంతయు నీ యందలి మోహకారణమే. కాని, మిత్రమా! మనకు దైవ మీయపూర్వసంఘటనమే జేయకున్న నాఁబదు కేమి కావలసినదోకదా!

(తెరలో) అమ్మాయీ! వెంకఁడు వచ్చినాఁడు.

భవా—(ఆత్రముతో) వెంకఁడు వచ్చినాఁడఁట! ఎట్లు చేసెదవో మన ప్రాణము మీఁదికి రాకుండఁ జేయవలయును. రమ్ము పోవుదము.

[ఇద్దఱు నిష్క్రమింతురు.]

# శ్రీకృష్ణలీలాశుకము

## ద్వితీయాంకము

### మొదటి రంగము.

[వెంకఁడు పాడుచు ప్రవేశించును.]

సోకూ, నా సోకూ, నా దేమి సోకురా, అహా॥ సో॥
సోకంటె సోకు గాదు, కైపంటె కైపు గాదు
సుక్కలో సున్నాది సుక మెల్ల హాయ్ హాయ్! సో॥
సారాయి తాగినోడ్కి సమసార మెందుకంట
కత్తికుట్టుముక్క నంజు కమ్మకమ్మ గుంటేని॥ సో॥
షాయికల్లు తాగినోడు పరువు తీసికొంటాడు
రమ్ముబుడ్డి పీల్చినోడు రాజులాగుంటాడు॥సో॥

ఓ రీడితచ్చిగ్గొయ్యాను! ఏం వుసారగున్నా దీయేల! చీ! యెదవ డబ్బు పోతే పోనాది గాని, నా సాఁయిరంగా! గద్దెక్కేన ట్టున్నాది. బగమంతుఁడు కడుపుకూటికి కరువెట్టినా, కల్లుముంతక నోటు సెయ్యేఁడు. దీని మయి మాడు మా బాగా తెల్చుగున్నాఁడు. కడం వేసుత్తున్నా, కల్లుపేరు సెప్తే డబ్బు కడవల్తో కురిసేత్తాది. (తెలివి తెచ్చికొని) ఆఁ! నా యవార మేంటి; నా సోకేంటి; మర్సేపోనాను. చుబ్బిగోణ్ణి రాయిసెట్టుకాడ కాసుగ్గూకుడోమన్నాను. కూకుచున్నా డో, కైపెక్కి తొంగుచున్నాఁడో! (తూలుచు గొంతెత్తి ఓరి చుబ్బిగోయ్! ఉసారు గుండ్రోయ్! ఇడేటా), నావాళ్ళే నాకుఁ దెల్టంతే



దీయేల! (ముందు జూచి నవ్వుచు) అద్గో! అద్గో! నా యాలి సువ్వాలిట్ట నాగ నవ్వు తొత్తన్నాది.

ఓలేయ్! నా మేనత్తకూఁతురోయ్!
రాధే పిల్లా! నా రాంసిల్కపిద్దాన॥రా॥

[మాతి ప్రవేశించును.]

రతనాలమేడ గట్టి రంగురంగుల సీరెట్టి
సెంపమీఁద ముద్దెట్టి సిన్నమాట సెప్తాను॥ రా॥
బంగారుతీగెడ్త పట్టిమ్మంచ మేయింత
సోకుమీఁద సోకు సేసి సొర్గలోక మెల్దారి॥ రా॥
యెంకడంటె పల్కబోను యెదవంటె నూరుకోను
బెమ్మదేము డైతేటి దుమ్ము లిర్గ మొడ్తాను॥ రా॥
కులమోళ్ళు మనకాడ గుంపల్లె కూకుడుంటె
యెంఖన్నదొరగోరు యేం సోకు సేత్తారో॥ రా॥

మ్మాతి—సేలో కెల్టా మానేసి యీ కత్తేంటి. యీ కతేంటా)!

వెంక—ఓసి నీ యబ్బడిసిగ్గొయ్యాను. అత్తవాన్ను సేనో, సేనో నేడక నీ కేం గావాలో సెప్పవే; తచ్చనం యిచ్చేత్తాను.

మాతి—ఈ యవార మేంటి, యీ యాస మేంటి? ఎన్ని మాట్లు కల్లు తాగొద్దన్నా నా మాట యినవంటా)! ఈతూరి తాగి నావంటే నీ కింటికాడ కూడు త్తిదే.

వెంక—(తనలో) దీనిగ్గూడా తాగు డలవాటు సేత్తేగాని నా యాట సాగేట ట్టనపట్టంలేదు. (ఫ్రి) ఉత్తినొచ్చిందాని కేఁయేఁ! ఆ బ్యామ్మఁడు దర్మారవాంట గొప్పోరుతాగే బుడ్డిసారా తేసినానే.

[తూలును.]

మాతి—ఏ బ్యామ్మఁడా నీ కిప్పించినోడు? అబద్దా లాడ్తా

నేయిరా?

వెంక—అమ్మతోడు; నిన్ను సంపుకొని తిన్నట్టే. నాకు, చుబ్బిగోడికి కూడా యేయించినాఁడే.

మాతి—ఓర్డా సచ్చినోడు! ఆడి కేం యినాళకాల మొచ్చిందిరా?

వెంక—నేను డబ్బు పాడుసేయనేదుగందా, నీ కెందుకొచ్చిన బాదే?

మాతి—ఉత్తినొచ్చిందికామట్టి తాగినావా? చరే! ఈ కత్తేంటంట?

వెంక—అయ్యొ తొత్తుకూఁతురా! ఏం గావాలో యాడక యీఁగొడబంతా నీ కెందుకే? మేడమీఁదఁ గూకుడుంతావా? నేకపోతే సందలు, తీగి సేయించుమంతావా? మఱేటో సెప్పు.

మాతి—కూటికే నేదుగందా, గుల్ల లెల్లా గొత్తాయిరా?

వెంక—నిజం సెప్పమన్నావంటే? మఱిను. ఇయ్యాల అయ్యగోరింటికి గొల్లని దోలాడిదాని కెల్లేచరికి కామాచ్చమ్మగోరు, బవానమ్మగోరు, బ్యామ్మడు గూకుడున్నారే.

మాతి—ఏ బ్యామ్మడు?

వెంక—ఏహె! బవానమ్ముంచుగున్న బ్యామ్మడే!

మాతి—అల్లాగనగూడదు. తప్పు కాదంట్రా!

వెంక—గొప్పోరికి తప్పేంటే?

మాతి—అప్పుడా ళ్లేటి సేసినారు?

వెంక—కామాచ్చమ్మగోరు నన్ను బిల్చి "యెంకఁడు మంచోడు—మనసం సెప్పినపని సేత్తాడు—బగుమానంగూడా యిమ్మని" బ్యామ్మడితో సెప్పినారు. ఆపాలి బ్యామ్మడు నన్ను కల్లుపాకకాడికి తీచిగల్లి ఒల్లుదెలియనంతకల్లోయించి అబ్బాయిగోరు సేలోంచొత్తుండగా సంపమని నాసేతి కీకత్తిచ్చి గుప్పెడు రూపాయిలు కూడా యిచ్చినాఁడు.

మాతి—అయ్యో! అయ్యో! ఎంతపాపం సేత్తున్నావురా? ఆ దిక్కుమాలినసచ్చినోడు సంపమంటే నంపుతావా? మన మేం పాపం సేసుకోమట్టో బిడ్డలుట్టకుండపోనారుగందా, అబ్బాయిగోర్ని సంపటానికి నీకు సేతు లెల్లాగొత్తాయిరా! మూర్కునుంయెదవ లెంతపనేనా సేత్తారాళ్లమాటింటావా? పాలేరుతనం నేకున్నా చరేగాని, ముందెల్లి అబ్బాయిగోరి పాదా లట్టుకో. నేకపోతే నిన్ను సంపి నేను సత్తాను.

వెంక—ఓలేయ్! నీమాట లిన్నాక నా కేడుపొత్తందే. చీ! యెదవకల్లుమూలంగా యెంతపాపం సేత్తున్నానే! మరిడిమాలచ్చిమి సాచ్చిగా యియ్యేలనుండి కల్లు దాగను. ఏం సేసినా గొప్పోరికే సెల్లింది గాని, నాయంటోడికి గూడదు. ఈపాలి తాగితే కూడెట్టకే.

మాతి—నీకు, చుబ్బిగోడికి యిరోదమన్నావుగందా, తాగటాని కెల్లా గల్లినాట్రా?

వెంక—కాలవగట్లకాడ కస్సుమనుకున్నా, కల్లుపాకలో వుసారుగుంటాఁడన్నమాటే. అదే దానిమయిమ. ఏలాటోడూగూడా తోడు లేకుంటే తోలెమైనా తాగలేడు.

మాతి—మఱి, చుబ్బిగో డెక్కడకు పోనాడు?

వెంక—[తెలివి దెచ్చుకొని] ఒలేయ్! మర్సేపోనాను. అబ్బాయిగోరు రాయిసెట్టిదారినొత్తారేమో యని రాయిసెట్టుకాడాణ్ణి కాసుగ్గూకోమని, నే నిక్కడ కాసుగ్గూకుడున్నానే. ఆడు సంపుతాడేమోగందా. బేగి పదే!

మాతి—ఇప్పటి కొల్లు తెల్చిందా! పద బేగి పద.

[ఇరువురును నిష్క్రమింతురు.]

రెండవరంగము.

---

[సుబ్బిశాస్త్రి కల్లుద్రాగి యొక చెట్టుక్రింద పాడుచుఁ గూరుచుండును.]

సుబ్బి — శ్రీమన్నారాయ ణాదినారాయణా
కరుణించివమ్మేలు కమలలోచనుడా!
ఏంకర్మ మేంకర్మ మెందుకొచ్చిన పెళ్ళి
తూర్మనుంమెదవలు మాటయింటారా॥
యెత్తుకుండామొగుడు యాంవారమేత్తేని
సదువుకున్నోడితో చరచమాడ్తాది॥
చరచమాడిందంటె చానెమ్మగాదురా
వైనింటికులములో అవతరించింది॥
అవతరింతేనేటి యాపిల్లగన్నోరు
ముసిలోడికమ్మేసి ముడిబెట్టినారు॥

అవ్వావవ్వా! నేను పదం కూరిసేత్తున్నాను కామోలు! ఇంకేఁ! బ్యాపనయ్యలాగ పురాంధాలు రాసేత్తానన్నమాటే. ఓరిబాబోయి బాబు! ఆనాలనుండి నాకీగోడబే తెల్లేదు. పదాలుకూర్సటం పాఖ్యమయిమే కామోలు! ఓరీడిచిగ్గోయ్యను; ఇప్పుడెంకడుంటే నాతవ్వానా సూసునుగందా! చీ! ఆడక్కడుండి, నన్నిక్కడుంచుమని కల్లుదాగివసుకం కనబడకుండాసేసినాడు. ఆ కుత్తైది ఇంకా రాలేదు. ఒత్తాడో, సత్తాడో తెల్దంలేదు. ఒకేల, యెంకడున్న దారినే యెల్లేడేమో! (ముందుచూచి) అదుగో! అదుగో! పల్లామామిడితోపుదాటి, అడ్డా, పాడ్తా మెల్లిగొత్తన్నాడు. ఆడే కామోలు! ఆడి గ్గనబడకుండా మునుగెట్టి కదలకుండా మెదలకుండా తొంగుడుండి దగ్గిరికి రాగానే కసిక్కునేసేత్తాను.

[మునుగిడి పడుండును.



[రామకృష్ణుఁడు ప్రవేశించును.]

రామ — అబ్బా! ఎండబాధ యెంతదుర్భరముగ నున్నది! అమ్మ వలదనుచున్నను బయలుదేరినందుకు శిక్ష ననుభవింపుచుంటిని. కానిమ్ము! ఈ చెట్టునీడ నొక్కింత సేదఁ దీర్చికొని పోయెదను. (కూరుచుండి) నే నింతశ్రమపడి వెళ్ళినతరువాత నాన్నగా రగ్రహారములో నుందురో, శ్రీకాకుళములో నుందురో! అన్నా! తండ్రిగారు ప్రవాసముననుండుటచేఁ దల్లిగారికి ప్రాణసంకటముగనున్నది. అందుపై నాడుదాని కాఁడుబిడ్డలచే సూటిపోటుమాటలఁ బడుటకంటె హైన్య మింకొకటి లేదు. అదేమిచిత్రమో! స్త్రీలోకమునకంతకు నీ కష్టమున్నదియే కదా, సమయమున కెట్లు మరతురో తెలియదు. ఇల్లలుకగనే పండుగవచ్చునా? ముందువచ్చునది ముసళ్ళపండుగ. కాని, నాకు తోటగారింటనుండుట గౌరవమని తోఁచుచున్నది. అది తండ్రిగా రాలోచింపవలసిన విషయముగాని, ఎవ రేమి చేయఁగలుగుదురు?

ఉ. పండుగ వచ్చుచుండె, నొక పాఁతయు లేదు ధరింప నాకు, పూ
జ్యుండగు తాతనిమ్మనినఁ జట్టున నొక్క చపేట మిచ్చి, యె
న్నండిటు పల్కఁబోకు మిట నాన్నగడించిన మూటలేదు; ఛీ!
పొండని నన్ను, నంబ నెడపుచ్చిన జేసెడిదేమి యక్కటా!

ఈ కష్ట మీనాఁటిదా! సుమా రేడెనిమిదేండ్లనుండి యనుభవింపుచుంటిమి. నే జన్మించినవెనుక నాన్నగారిని లెక్కకు నాలుగైదుమారులుచూచియుంటిని. కాని, తిరిగి మూడేండ్లనుండి వారిదర్శనమే లభియింపకున్నది. శ్రీకాకుళములో శాస్త్రాధ్యయనము సేయుచుండిరని కొందఱు- దేశాంతరమేగెనని మఱికొందఱు- ఇల్లెవరికిఁదోఁచినట్లు వారు, తల్లితోఁ జెప్పుచుండుటచే నామె మఱింత బెంగఁగొని కంటికి నేలకు నొక్కటే ధారగా నేడ్చుచున్నది. అట్లా మెదుగికుంచుట నాకును విచార

కారణమై, యేమియుం జేయఁజాలక నాన్నగారిని దోడుకొనివత్తునని చెప్పి యూరడించివచ్చితిని. నాన్నగా రాగ్రహింతురో, అనుగ్రహింతురో! ఏమైననుసరియే! పోయి వేఁడుకొందును—అమ్మగారి ప్రార్థనల నివేదింతును—తుదకు నలుపురిలోఁ దగవు పెట్టెదను. ఆ కనఁబడునదే శ్రీకాకుళము కావచ్చును. ముందక్కడకుఁ బోయి యందు లేకున్నచో నగ్రహారముపోయెదను. తరువాత —

సుబ్బి—(చటాలున లేచి) అన్నా! ఎంతలో కన్ను మూసుక పోనాది! (పరికించి) ఆఁ! బయం నేదు. ఇంకా దాటి పోనేదు. గా! సచ్చినోడా! నిన్నమ్మోరికి బలెడతాను.

రామ—(తనలో) అయ్యో! వీఁడెవఁడో ఒడలు తెలియక తప్పత్రాగియున్నాఁడు. ఇప్పుడు నన్నేమిచేసినను జేయఁగలఁడు. దూరమునుండి తప్పించుకొనిపోయెదను. (వెనుకకుమరలును.)

మాధ—ఓరి కుత్తెదవా! ఎంత టక్కరి సేసినావురా? నా సేతినుండి దాటికెల్తావా? నిన్నేమిసేత్తానో సూస్కో నాతమాసా?

[రామకృష్ణునిపై కత్తి యెత్తును.]

రామ—అమ్మా! చచ్చితిఁ జచ్చితి. [భూమిపై వ్రాలును.]

[మాధవుఁడు పెట్టెతో ప్రవేశించును.]

మాధ—అదేంట్రా! అదేంట్రా! కుఱ్ఱోణ్ణి సంపినా వేఁయిరా నీ జిమ్మడ!

సుబ్బి—ఎహె! ఊరుకోస్! ఈడిసొమ్ములు మనిద్దరం పంచుగుందారి. ఈ పెట్టేటి?

మాధ—మాయయ్యగారికి రాత్రి తోట్లో దొరికింది, ఇందులో యేటుందో తెల్దు. ఇంటికోట్టుకుపొమ్మని సెప్పినాడు.

సుబ్బి—రేత్రే దొరికిందిగందా, ఇప్పుడట్టుకెల్తున్నావేఁయిరా?



మాధ—పొద్దొడకుండానే బయల్దేరేను. దారిలో అయ్యగారి సానెమ్మ అడ్డుదగిలి నన్ను దానింటికి నాక్కుపోయి సెప్పినపని సెప్పకుండా పొద్దుటేలనుంచి సంపేసింది. సెయ్యకుంటే అయ్యగారితో సెప్పతాది. అయ్యగారబద్దం సెప్పినా దానిమాటే యింటాడు కాని, నా మాటినడు.

సుబ్బి—అయితే, మనం యిప్పుడో కమంత్రం సెయ్యాల; ఈ పెట్టిలోవున్న లొడ్డు లొసుగు మనం సక్కబెట్టుగుని కుఱ్ఱోణ్ణిందులడేసి యేమెరగనట్టు మీయయ్యగారింటికాడడెయ్యాల.

మాధ—నువ్వు సెప్పినట్టు సేత్తాగాని, నీ సొమ్ములు గూడా బాగ మెడ్తావా?

సుబ్బి—నీయి, నాయి గూడా కలబోసుగుని పంచుగుందారి.

మాధ—ఈ రాస్యం మనిద్దఱిలో నుండాలినుమా! గొంతు గోసినా చరే సెప్పగూడదు. సేతులో సెయ్యేయ్!

సుబ్బి—(చేతిలో చేయివైచి) సంపుతే సెపుతానంటా?!

మాధ—(పెట్టెదింపి) నీకాడ దొంగతాళముందా?

సుబ్బి—పగలగొట్టాస్!

మాధ—అయ్యగారి కానాలు తెలుత్తాది.

సుబ్బి—ఆనాలు లేదు, గీనాలు లేదు. నే తీత్తానుండు. (పెట్టెనిటునటు గుంజి తెరచి) ఇదేట్రా! ఇందులో పందికొక్కులవెంటున్నాది?

మాధ—అయ్యో! అయ్యో! ఆ వైదీకుతురు సక్కమెట్టింది కామాలురా బాబూ! నా కేం కర్మంరా? తేలిగ్గుంటే అప్పుడే అనుమానం పడ్డానురా నాయనా!

సుబ్బ—ఏడకురా నాయనా! దొంగోడికి తేలుగుట్టినట్టూరుకో! ఎవరసొమ్ము పోతే పోనాది. ఈ కల్తోలిసొమ్ములు నాకాడుండా దాను. ఈ ణ్ణంటు ఒడ్డే సిచ్చేసి రా! మనింటికాడ పంచుగుంటారు. చే గల్లిరా!

మాధ—(రామకృష్ణునిశవము పెట్టెలో పడవేసి తాళముత్రిప్పి) ఇనిక్కాసేదంటావు సుబ్బా

సుబ్బ—ఇత్తాను బేగి రారా!

[ఇద్దఱు నిష్క్రమింతురు.]

---

రంగము—నాగావళీనదీతీరము.

[సుందరుఁడు ప్రవేశించును.]

సుంద—అక్కటా! ఎంత ఘోరము దలఁచిరి? పశుమారకుం డైనను నరమారణం జేయ నిష్టపడఁడే! ఔరా! సవతితల్లిప్రేమ యన నిద్దియే కాఁబోలు! నే నుదయమునఁ దా నెంతో మహాత్ప్రేమ గలదానివలె నటియించి నన్ను గేదారములకుఁ బంపు టిందులకా? ఆహా!

ఉ. అమ్మ వటంచు భక్తి నిను నాత్మ భజింపుచు, నీదు మాటఁ జి
త్తమ్మున మాతృవాక్యముగఁ దార్కొనఁ జేసితి నింతదాక, లో
పమ్మొకఁ డున్న నాయెడఁ, గృపామతిఁ బ్రోవఁగరాదె, తల్లి! పా
పమ్మొసఁగట్ట నేటికిటు బాలుని జంపి వివేకహీన వై.

ఆర్యా! యథార్థప్రేమకళల వనుకొంటిని గాని, పయోముఖ విషకుంభ వని యెఱుఁగనైతిని గదా తల్లీ! నా యెడఁ గల యపరాధ మేమి! నిన్ను సాక్షా న్మాతృదేవతగ భావించి యున్న నా యెడల



నిట్టి యకార్యకరణమునుం జేయఁ దగునా? ఒకవేళ, నా యం దేమైన లోపమె యున్నచో, గృహత్యాగిని జేసిన జాలునే! ఇంత ఘోర మేల తలంచితివి? బ్రతికియున్నచో, బలుసాకైనను దిని యుందును! సవతియే మారుతల్లి కిది సహజధర్మము కావచ్చును. కన్నతండ్రి కడు పేల గడ్డ కావలయును? కన్నవానిని కనులతో బెదరింపవలయుఁ గాని, కత్తితో బెదరించు టేల! హా! ఏమి నా ప్రారబ్ధకర్మము! జననీ ప్రేమ సౌభాగ్యము లేకున్నను, జనక ప్రేమానంద మైనను ననుభవింపలేదే! ఇది యంతయు నా పురాకృతకర్మము గాని, మఱేమియును గాదు.

గీ. ఎవని కర్మంబునకుఁ గర్త లెవ్వరగుదు
రనుభవించుట తక్క చేయునది కలదె?
నలువకైనను, వేనోళ్లచిలువకైన
సత్యపాశముల డాగి సగ్గియున్నఁ
దరమె? ప్రారబ్ధకర్మంబు దప్పు నొక్కొ!

తల్లిగారు నా పైఁ బ్రయోగించినకత్తివ్రాలనుండి నన్నెవ్వరు తప్పించిరి? నన్ను మారణహోమమునం జేయఁదలఁచినదుర్మార్గుని హృదయశైలము నంతలో నవనీతకోమలాయత్తచిత్తముగ నెవ్వరు ద్రవింపఁజేసిరి? మాతీమహామాతయే కదా! ఏ జాతి దైన నేమి? చేయెత్తి మ్రొక్కవలసినదే. తల్లీ! మాతీమహామాతా! నీవు నా యెడఁ గావించినమహత్కార్యమునకుఁ బ్రత్యుపకార మేమి చేయఁగలుగుదును! ఎన్ని జన్మము లెత్తినను, నీకు ఋణస్థుఁడ నై యుండవలసినదే. కాని, యీ కుట్రయం దొక బ్రాహ్మణుఁడు కూడ నున్నట్లు వారి మాటలలో ధ్వనించినది. ఎందువలననో, యవృత్తాంతము చెప్పఁబోవుచుండ వలదని మాతి సంజ్ఞ చేసెను. ఆతఁ డెవ్వఁడై యుండును చెపుమా! (ఆలోచన నటించును.)

[మాధవుఁడు పెట్టెతో ప్రవేశించును.]

మాధ—(తనలో) ఓరి బాబో! నా పానానికి డేవుఁడోయ్! యేడిగ్గనఁబడకుండ సెట్లసాటు వడి పోతాను.

సుంద—ఓయీ! నీ వెందుండి వచ్చుచుంటివి?

మాధ—(స్వ) అన్నా! సూసినాడు గందా! ఇప్పుడేటిసెప్పేది; ఏదో మంత్ర మెట్టాల. (ప్ర) ఆముదాలొలసనుండి బాబయ్యా!

సుంద—ఎక్కడకుఁ బోయెదవు?

మాధ—అగ్గురార మెల్తానండి. ఇంకా యెంతదూరమున్నాది బాబయ్యా!

సుంద—ఈ నాగావళి దాఁటి పోయినచో నద్దరి నున్నదే యగ్రహారము.

మాధ—పల్లాకొంప లనబడే దే యూరు బాబూ?

సుంద—అది శ్రీకాకుళము.

మాధ—సిత్తం. ఎల్లొత్తాను సెల విప్పించండి.

సుం—నీవు వచ్చునప్పుడా ప్రక్క నెవ్వఁడో బొట్టెఁ జేడ్చి నట్లు వినఁబడిన దేమది?

మాధ—(తనలో) ఓరి బాబో! గొంతు కట్టుకున్నాఁడు.

సుంద—ఆలోచించుచుంటి వేమోయి!

మాధ—నాను సూపు నేదండి. గొల్లకాడికుఱ్ఱోళ్ళు నొవ్వఁ గొట్టుకున్నారు కామోలు!

సుంద—అంతియేనా? సరే! పొమ్ము.

మాధ—(తనలో) ఈ డేమి సేత్తాడో యని నా పానాలు బితుకు బితుకు మన్నాయి. ఇం కుండఁగూడదు.

[నిష్క్రమించును.]



సుంద—ఇప్పుడు నాకు ముందుగతి యేమి? ఎక్కడకుఁ బోవుదును? ఎవరి ప్రాపుఁ జేరుదును?

ఉ. కాలము చాలయయ్యె; దినకాంతుఁడు వ్రాలెను గ్రుంకుకొండకున్
జేలకు మేతకుం జనిన చిల్కలు, గోరలు, కాకిమూక, గ
గ్గోలొనరించుచుం దరుల, గూండ్లను, దొఱ్ఱుల వచ్చి చేరెడుఁ
జాల మిఁకేల మద్గురులసన్నిధి నంతయు దెల్పఁ బోయెదన్.

(నిష్క్రమించును)

రంగము—ధనరాజు గృహము.

[ధనరాజు, అన్నప్ప ప్రవేశింతురు.]

ధన—అన్నప్పా! ఈ పీనుఁగు బ్రదికి యున్నాఁడా, చచ్చి నాఁడా?

అన్న—అదేమోనమ్మా! కాశీయాత్ర వెళ్లెనఁట! వానికాశీ యాత్ర మండిపోను.

ధన—కాశీ కాదు; యాత్రయును గాదు. అది నిజ మనుకొంటివా? పట్టిది పట్టెది. నీ వెన్నఁడా మాయచచ్చినవానిమాటలు నమ్మకుము. చింతామణికి చంద్రహారము జేయించుమంటిని. చేతిలో డబ్బులేదు కాఁబోలు నందుచే నిన్నిపోకడలు పోవుచున్నాఁడు.

అన్న—నిజమేనమ్మా! చచ్చిన పెండ్లముతోఁ దానుగూడఁ జచ్చుటకుఁ గాని, యిప్పుడు కాశీ యెందులకు? ఈ నిర్భాగ్యునకు వైకుంఠ మెదురువచ్చునా యేమి? లేక లేక యొకపిల్లను మహాఫలముగ దైవము బ్రసాదించెఁగదా, దాని ముద్దుముచ్చటలు తీర్పలేని వాని బ్రదుకెందుకు? కాల్పనా?

ధన—వాఁ డేమి తీర్పఁగలఁడురా, బోడిసన్యాసి! ఎందుల కైనను సుబ్బిసెట్టియే సరసుఁడు గాని, తక్కినదద్దమ్మలా సరసులు!

సీ. తోమాసీలుండా తోళ్క తాంబూల మీయంగ
చిల్లరబేరముల్ జేయుమనియె
కామేశ్వరుఁడు మొన్న కనుసన్న సేయంగ
కొట్టుసాదరు కొంత కూర్చు మనిరె
భాస్కరనాయుఁడు బండి పంపినయప్పు
డధికారివెచ్చ మర్థాంగ మనియె
గిరిరాజు వెలలేని కెంపుకమ్మల నంప
వడ్డియే సిరికి నివాస మనియె
గీ. పద్మనాభుఁడు మున్న నన్ బ్రాపు సేయ
గుత్త కొనుటయె కోటి విత్త మనియె
పడపుకత్తెకు సరసమే భాగ్య మనియె
నహహా! సరసుఁడు బచ్చుగా కన్యుఁ డగునె?

అన్న — ఓ నమ్మా! వర్తకరహస్యము లాతనికిఁ దెలిసినట్లు మఱెవ్వరికిని దెలియవు. చాల మంచివాఁడు. నాకు మొన్నటిరోజున నైఁటకు పట్టుసెల్లా యిచ్చి పదిలముగ దాఁచుకొనుమని చెప్పినాఁడు. కాని, వామనమూర్తి మాత్రము సరసుఁడు కాడనుకొంటివా? నీ వడుగనేలేదు గాని, పూలతోఁట వ్రాసి యిమ్మన్న నిచ్చును. ఆతని సాహస మింకను నీకుఁ దెలియకున్నది.

ధన — వెఱ్ఱి యున్నప్పా! ఇంతకాలమువఱకును బూలతోఁట వ్రాయించుకొన నూరకుంటివని యేమి తలంచితివా?

అన్న — అట్లయిన శుద్ధపన్యాస మిప్పించితి వన్నమాట యేమి.

ధన — ఆతని లెక్క యేమి? ఇఁక ముందు సుబ్బిసెట్టికి జరుగఁబోవు సౌభాగ్యము జూడు మేమి చేసెదనో?

అన్న — అయితే, దివాలా తీయించెదవు కాఁబోలు!



ధన — నేను దీయించున దేమి? మన చింతామణిని గన్నతికము జేసికొనవలె నని యాతని కభిలాషముగ నున్నది. అప్పు డాతఁడు కాడు గదా, ఆతనిని బుట్టించిన భగవంతుఁడు గూడ తనసర్వస్వమును జింతామణికి సమర్పింపవలసినదే.

అన్న — అదిగో! సుబ్బిసెట్టి వచ్చుచున్నాఁ డిఁక నాతనివిషయింకఁ గట్టిపెట్టుము.

(సుబ్బిసెట్టి ప్రవేశించును)

సుబ్బి — (కంఠరవము మార్చి) ధనరాజూ! చింతామణికన్నతికము మాట యేమి చేసితివి?

ధన — ఇంకను రెం డేండ్లమాట గదా; యిప్పటినుండియు తొందరెందులకు?

సుబ్బి — నా మాట మాత్రము మఱచిపోకుసుమా!

ధన — అబ్బా! అదియా? నాతో సరస మింత వెలుఁగఁబెట్టితివి; ఇఁక చింతామణితోఁ గాని వెలుఁగఁబెట్టఁబోవు. చాలుఁ జాలు. ముండభాగ్యము ముత్యాలహారమే కొనలేకపోతివి.

సుబ్బి — మంచిముత్యాలు దొరకుటలేదు. బిళ్లోరిముత్యాలు కొందునా?

ధన — (బుగ్గలు పొడిచి) ఓరి నీ సిగ్గు చిమ్మడ! ఆ ముత్యాలు నా యింటికుక్కకైనను గట్టలేదురా. ఇంకను నయమే; జీలుగపేరులు కొందునన్నావు కావు.

అన్న — (నవ్వును)

సుబ్బి — అదిగో! ఇందుకే నీకు, నాకు, తగవులాట. ఎందుకా నవ్వు? అవలకు పో!

అన్న—(నవ్వుచు) శెట్టిగారూ! కోపపడకండీ! ఇక్కడ కొ్రత్త పా రెవ్వరునులేరు. మీబుగ్గపోటుసరసములు, పాదరక్షలబహుమానములు నే నెఱుఁగనివి కావు

సుబ్బి—ఇదిగో! ధనరాజూ! నీ కొక రహస్యము జెప్పెదను గాని ముందన్నప్ప నావలకుఁ బంపెదవా లేదా? (జేబు సవరించును)

ధన—(తనలో) ఏమో తెచ్చినటు లున్నాఁడు. ఎక్కడకుఁ బోనిత్తును! సమర్పించి తీరవలె- చచ్చి తీరవలె-లేకున్న మాటలతోఁ బోనిత్తునా? (ప్రకా) అన్నప్పా! నీ వనేమాటయు నెఱుఁగవు; అనఁ గూడనిమాటయు నెఱుఁగవు. పెద్దమనుష్యులవద్ద నెట్లు మసలవలయునో నీ కింకను దెలియలేదు గదా! అదేమి దాంపత్యమో, ఆ వామనమూర్తిని జూచుకొని మఱింత కులికిపోవుచున్నావు. చాలుఁ జాలు! వంటపని చూచికొనుము; పొమ్ము.

సుబ్బి—(నవ్వుచు) అది-ఆలాగున గడ్డిపెట్టుము.

అన్న—ఆ పాళమున గాదు. ముందుగ నీవు నమలినతరువాత,
(నిష్క్రమించును)

ధన—వానితో మీ కెందుకు సెట్టిగారూ! ఊరకుందురు.

సుబ్బి—అవును. అట్టివానితో మాటాడుట నాదే తప్పు. (చంద్రహారము దీసి) ఇదిగో! ఇది చింతామణి కొఱకు చేయించితి నెట్లున్నదో చూడుము.

ధన—(పుచ్చుకొని) చాల బాగుగ నున్నదండీ! దాని కన్నెతికమునాఁ డిది యలంకరింపవలయును.

సుబ్బి—అదే! అదే! అందుకొఱకే చేయించితిని.

ధన—సెట్టిగారికి బుగ్గపోటులతో నాపైఁగోపమురాలేదుగదా! నే నెందులకుఁ బొడిచితినో సరసులంత మాత్రము గ్రహింపకుందురా?



సుబ్బి – అమ్మతోడు; గల్లాపెట్టె తోడు. నా కందుకుఁ గోపములేదు గాని, అన్నప్పగాఁడు నవ్వినందుకు మాత్రము కోపము వచ్చినది. నీ వానాఁటిరాత్రి తన్నినప్పుడు కిక్కురు మంటినా? కోపించితినా! నా మీఁద వలపనే యూహించితిని కాదా మఱి.

ధన—అందుకొఱకే నేనును సరసమాడుచుందును. లేకున్న మీ తాహ తేమి? మీ దర్జా యేమి? మీ హోపేమి! ఎవరైన మీకాలి గోరుకైనఁ బోలెదరా?

సుబ్బి—(నవ్వుచు మీసము ద్రిప్పుచు) వహ్వావహ్వా! ఇది యింతయు నవ్వులాటే కాఁబోలు!

ధన—సెట్టిగారూ! మీ కా రెండవమీసము గూడ నేను గొఱికినయెడల నిజముగ నవమన్మథుఁడవలె నుందురు

సుబ్బి—ఔబ్బ! ఏమి సుఖము! ఏమి సరసము! ఈ సరస మంతయుఁ జింతామణి కన్నెఱికములోఁ గనఁబడవలయును.

ధన—అన్నట్టు—మన మాటలగొడవలో మీతో ముఖ్యముగఁ జెప్పవలసినవిషయమే మఱచితిని. చింతామణికి మీ పేరు చెప్పినసరి కెక్కడలేనియానందము వచ్చు నదేమి యనురాగమో!

సుబ్బి—(నవ్వి) నిజమే? నిజమే? చింతామణికి నా మీఁదఁ గుదిరినదా? ఈ చంద్రహారము దానిమెడలో నిప్పుడే వైచెద నొక్కమా ఱిటు పిలువుము.

ధన—ఆలాగుననే. (తెరవైపు చూచి) అన్నప్పా! అమ్మాయి నొకమాఱిటు తీసికొని రావయ్యా!

(తెరలో) ఆలాగే.

సుబ్బి—(దుస్తులు నలంకారములు సవరించుకొనును)

అన్న—(ప్రవేశించి) అదేమిపిల్ల తల్లీ! కృష్ణమూర్తిబొమ్మకుఁ బూజసేయుచు, ఎన్నివిధముల రమ్మని బలవంతపెట్టినను వచ్చెదను పొమ్మని కసరికొట్టినది.

సుబ్బి—నేను వచ్చితి నని చెప్పకపోయితివా?

ధన—చాలుచాలు. నిన్ను జూచి భయపడినయెడల రతు లేకుఁ గూడ దొరకదు. (నిష్క్రమించును)

ధన—అన్నా! ఎన్నివిధముల చెప్పినను వీనికి బుద్ధి రాదు గదా! సెట్టిగారూ! మీకును, అన్నప్పకును బొత్తుగ పడకుండవచ్చిన దేమి కర్మము?

సుబ్బి—ఏమా? నే నొక చిన్న తెలివితక్కువపని చేసితిని. ఆ నడుమ నొకనాఁడు కనుచీఁకటి సమయమున నే నిక్కడకు వచ్చుసరికి వాఁడు పాపిడి దిద్దుకొని, పైట సవరించుకొని వీధిగుమ్మముకడఁ గూరుచుండఁగ నీ వేమో యనుకొని చక్కిలిగింత పెట్టితిని. అప్పుడే పై నున్న పట్టుసెల్లా యిచ్చి యీ రహస్య మెక్కడను వెల్లడిసేయ వద్దని బతిమాలుకొంటిని.

అన్న—(ప్రవేశించి) అన్న సెట్టీ! ఎంతకైనను దగుదువయ్యా! రేఁజీఁకటిమాట మఱుఁగుపెట్టి కనుచీఁకటి యని బొంకుచుంటివా?

ధన—(కోపమున) రేఁజీఁకటియే గాని దివాంధుఁడు గాఁడు గదా?

సుబ్బి—అది-అది-అలాగున బుద్ధి చెప్పుము.

అన్న—ఆ బుద్ధి నీకుఁ జెప్పుట గాని, నాకుఁ గాదు. కోమటి రహస్య మిట్లే యుండును. (నిష్క్రమించును)

సుబ్బి—ధనరాజూ! నేను బయలుదేరినవేళ మంచిది కాదు. ఒక్కమాఱు ఇంటికి వెళ్లి మరల వచ్చెదను.



ధన—అమ్మాయికి గజ్జెలపూజ చేయింపవలయునని యున్నది. మీ యభిప్రాయ మేమి?

సుబ్బి—(తనలో) మన దర్జా యిప్పుడు చూపింపవలయును. (ప్రకా) అభ్యంతర మేమున్నది? సొమ్ము కావలయు నేమో చెప్పుము. నాల్గువంద లంపిన జాలునా?

ధన—ఓ! అంతకంటెను గావలసిన దేమున్నది? చాలును. మీ సాహసము నే నెఱుఁగనిదానను గాను. కాని, నేఁ జెప్పినది కూడ మఱచిపోకండి.

సుబ్బి—ఇదిగో! కొంగు ముడివైచికొనుచున్నాను. ఇంక మఱచిపోయినయెడల నీ గుమ్మము తొక్కనీయకుము.

ధన—సరిసరి! ఎంతమాట సెలవిచ్చితిరి! తిని లేదనఁగూడదు. ఇది యంతయు సెట్టిగారి భాగ్యమే.

సుబ్బి—నీవు మంచిదానవు కావున నిట్లంటివి కాని, యా విశ్వాసహీనురాలు సూర్యకాంతము "నీ ప్రాణమునకు, నా ప్రాణమునకు లంకె" యనిచెప్పి, యంతసొమ్ముం దిని తుద కేమిచేసినదో చూచితివా?

ధన—తాగలేనిపిల్లి బోరగిలఁ ద్రోసికొన్న దన్నట్లు మీ సొమ్ము దాని కఱుబలము లేదు. ఇంతకును, మీ భాగ్య మనుభవించుదానను నేనై యుండఁగ దాని కేల దక్కును.

సుబ్బి—మంచిమాట చెప్పితివి. దాని కర్మ మంతే. ఇంక నేఁ బోయి వచ్చెదను. (నిష్క్రమించును)

ధన—పాప మీఁతడు వట్టి యమాయకుఁడు. సానీవలపు నవతితల్లి ప్రేమయని యెఱుఁగఁడు. కానీ! దీప ముండఁగనే యిల్లు నవరించుకొనవలె నన్నట్లీతనిభాగ్య మీ సమయముననే రాఁబట్టవలయును,

(చింతామణి కృష్ణవిగ్రహముతోఁ బ్రవేశించును)

చింతా—అమ్మా! నన్ను బిలువనంపితి వెందులకు?

ధన—అమ్మాయీ! ఈఁడువచ్చుచున్న దానవుగదా, ఆటలు, పాటలు నేర్వవలయుఁ గాని యీ పూజ లెందులకమ్మా?

చింతా—ఈ గోపాలకృష్ణునితో నాడుకొనుచుఁ బాడుకొనుచునే యుంటి నమ్మా!

ధన—అయ్యో, వెఱ్ఱితల్లీ! మనకులమున కాటపాటలన నిట్టివి కావే!

సీ. పెండ్లిండ్ల మేళము ల్పెక్కులు గావించి
భరతవిద్యాప్రౌఢిఁ బడయవలయు
సంగీతసభ లందు స రి గ మ స్వరములు
నీటుగా వీణియ నీటవలయు
రచ్చపట్టులఁ జేయు రామోత్సవము లందు
వర్ణముల్, జావళుల్, బాడవలయు
ఊరేగు తఱి నవ్వు లోరచూపులు, సైఁగ
లొనరించి యొడుపుగ నొదగవలయు.

గీ. నన్ని విద్దెలు కల వింకఁ జిన్నదాన
వన్నిటం బ్రౌఢవై నాకు వన్నె దెచ్చి
సాటిబోఁటులలో నెల్ల మేటి వగుచు
సిరుల నార్జించి విఖ్యాతిఁ జెందు మమ్మ!

చింతా—అమ్మా! ఆటపాటలలో నిన్ని భేదములు గలవాని అయినచో నన్నియును శ్రీకృష్ణపరమాత్మను గూర్చియేనా?

ధన—కా దమ్మా! నేఁ జెప్పినది మన కులధర్మమును గూర్చి కాని, శ్రీకృష్ణునిగూర్చి కాదే! అయ్యో! పదేండ్లపిల్లవు కదా, యెంత చెప్పినను దెలిసికొననేర వింత యవివేక మేమే.



చింతా—నా మాటయం దవివేక మేమున్నది? యదార్థమే యగును. కాని, నీకు మా గురువులవలె బోధించుశక్తి చాలమిం జేసి నీ యర్థమును నేను విస్పష్టముగఁ దెలిసికొనఁజాలకుంటి నేమో!

ధన—(కనులెఱ్ఱఁజేసి) ఓహో! వరప్రసాదినివలె నొక్కగానొక్కపిల్లవు కదా యని యూరకున్నకొలఁదియును పిల్ల వచ్చి తల్లినే వెక్కిరింపుచున్నదే! నా మాట నీకు బోధ యగుట లే దేమి? సరియే! నీగురువుచేతనే చెప్పించెద నుండుము.

చింతా—అమ్మా! ఇంతమాత్రమున కోప మేమిటికే? నా వలనం గలిగినయపరాధ మేమున్నది?

చ. చిఱునగుమోముతోడఁ దులసీవనసీమను గోపకన్యకా
పరివృతరత్నపీఠిఁ గరపంకజము ల్మురళీమృణాళి పైఁ
బరపుచు గానముం జెవులపండువు సేయుచు నాడుచున్న యా
కరివరదు న్భజింపుచును గానము సేయుచు నాట్య మాడితిన్.

ధన—(తనలో) ఔరా! దీనిమూలమున నా తనువు తెల్లవారనుకొనుచుండఁగ నెట్టి ప్రారబ్ధము సంభవించినది! ఏనాఁడైనను గులవృత్తిని గాలఁదోసిన కులఁటను గని విని యెఱుఁగుదునా? సర్వసంగపరిత్యాగి యగునాతఁడే మోక్షమార్గమును ముడుపుగట్టి సానికి సాష్టాంగపడుచుండ పడుపుఁగత్తెకు భక్తి యేల, పూజ లేల?

చింతా—అమ్మా! నేఁ డింకను గురువుగారు రాకుండుటకుఁ గారణ మేమి?

ధన—(స్వ) ఏమి చెప్పఁబోయినను నిక్లే యంతలో మఱపించును. (ప్ర) వచ్చెదరు కాని, అమ్మాయీ! సుబ్బసెట్టిగారు నీకుఁ జంద్రహారము జేయించి తీసికొనివచ్చి రిదిగో చూడుము. (ఇచ్చును)

చింతా—(తీసికొని)సుబ్బిసెట్టినాన్నగారే చేయించినారా? మా గోపాలమూర్తి కలంకరించుటకుఁ జాల బాగుగ నున్నదే! (కృష్ణవిగ్రహమునకు వైచును)

ధన—(తనలో) సరిసరి! దీనివ్యవహారమంతకంతకు శృతిమించి రాగమునఁ బడుచున్నది. ఈవావివరుసలమూలమునఁ గన్నెతికముం జేసికొనఁదలచిన సెట్టిని గాలఁదన్నును గాఁబోలు!

(తెరలో) చింతామణీ! గురువుగారు వచ్చినారు.

చింతా—(అదటిపడి) అమ్మా! గురువుగారు వచ్చిరఁట! చదువుకొనఁ బోయెదను. (నిష్క్రమించును)

ధన—అన్నా! దీనిమూలమున బలవంతముగ నురి వెట్టుకొని చావవలసివచ్చునట్లున్నది. పూజలా! పురశ్చరణలా! ఆహా! ఇంట నొంటలేని యుట్టియాచారము సానికులమున నెన్నఁడైన, నేయుగమందైన గలదా? ఈనాఁటి కిది భోగవృత్తిని బొగ్గులుసేయ బడబాగ్నివలెఁ బుట్టినది. ఏమనుటకును నోరు రాకున్న దేమి చేయుదును! తైల మున్నంతవఱకే గృహమునకు దీపకాంతి—దీపకాంతి యున్నంతవఱకే శలభమునకు ఫలభ్రాంతి—అట్లే, వారకాంతకును యౌవన మున్నంతవఱకే గౌరవము గాని, యాపెనుక నెవ్వఁడైన గన్నెత్తి చూచునా? కానిమ్ము ఇంకను మంచిమాటలచే మందలించి చూచెదను.

(నిష్క్రమించును)

---

# శ్రీకృష్ణలీలాశుకము

## తృతీయాంకము.

### మొదటి రంగము.

హరిమూర్తి, కాశీపతి, ప్రవేశింతురు.

హరి—ఏమండోయ్! కాశీపతిగారూ! చాల తొందరతో వెళ్లుచున్నా రెక్కడకు?

కాశీ—(తనలో) మంచి శకునమే యైనది. వీని కిప్పు డేమి చెప్పుదును! (ఆలోచించి) ఇట్లు చెప్పి చూచెదను. (ప్ర) ఇవ్వేళ నగ్రహారములో దామోదరపండితులింట సదస్యమఁట! అక్కడకుఁ బోవుచున్నాను.

హరి—మీ కెవరు చెప్పిరోగాని, పొరబాటు చెప్పియున్నారు. క్రిందటిసంవత్సరమున వివాహమును, నీ సంవత్సరమున బునస్సంధానమును గూడ జరిగినవి

కాశీ—ఆమాట నేను నమ్మను. దామోదరపండితులు లేమి, నా కెఱుక లేకుండ శుభకార్యము సేయుటేమి? నీ తంత్రపుమాటలు, నీప్రతిష్ఠ—నాకడఁ జెప్పకుము.

హరి—(తనలో) అన్నా! వీనికి నా గుట్టు తెలిసెను గాఁబోలు నిఁక నూరకుండరాదు. (ప్ర) నీ ప్రతిష్ఠ యేమంత వెలుఁగుచున్నది? అర్ధరాత్రిమున నాలియుంపుడుగానిచే నసికోతఁ బడినమహానుభావుఁడవే కాదా!

కాశీ—ఔను. నేనే బడాయికి గంగానదిని గంతమువలెకను దిగి కొంగజపము సేయుచు, కడుపునబుట్టినముండ దొమ్మరవానితో గడ నెక్కి డోలు గొట్టుచుండఁగ జూచి యేమియుఁ జేయలేకపోయితిని. ఇంకను సిగ్గులేక నన్నధిక్షేపింపవచ్చితివా?

హరి—బావగారూ! ఏకాంతము లోకాంతమైనది కావున, యథార్థము జెప్పెదను వినుఁడు. అధీనము తప్పినకుబ్జ దొక్కతె యెక్కడకుఁ బోయినదో పండ్రెండేండ్లనుండి కనఁబడుటలేదు. ఇప్పుడు దాని మూలమున సంసారముగడచు సాధనము లేకున్నది. అది యున్నప్పుడు దానిమనోవృత్తితోఁ గొంతకాల మిబ్బందిలేకుండ నుండెడిది. ఈ పండ్రెండువత్సరములనుండియు పిల్లలతోఁ గటకటలాడి పోవుచున్నాను. మీకేమైన దానిజాడ తెలిసినదా!

కాశీ—సరే! బాగుగనున్నది రోలు వచ్చి మద్దెలతో మొఱ్ఱ పెట్టినట్లున్నది. నాకును నట్టికష్టమే సంభవించినది. కుబ్జవానిని చదువు నిమిత్తము మీ గ్రామములోఁ బ్రవేశపెట్టితిని. వాఁడును మీపిల్లవలెఁ బండ్రెండేండ్లనుండియే కనఁబడుటలేదు. ఈ నిర్భాగ్యుఁడు చదువు, చట్టుబండలు లేదు సరిగదా, ఉన్నాఁడో, ఊడినాఁడో కూడ తెలియదు.

హరి—అయితే, బావగారూ! మనమాటలసందర్భము బట్టి చూడ నాకొక్కయనుమానము గలుగుచున్నది ఒకవేళ మనము వియ్యమందలేదుగదా!

కాశీ—ఔను-నిజమే-సందేహ ముండదు. వాళ్లొండొరులు పెండ్లిచేసికొన నిష్టపడినను మనము శుల్కమునకుఁ బట్టుపట్టి వారి పరస్పరప్రేమానుబంధ మెడఁబాపితిమి. తత్ఫలిత మిదియే. ఈ కన్యావరశుల్కము లున్నంతకాలము-తిరిగిస్వయంవరవివాహములుబయలు వెడలనియంతకాలము-దేశ మిట్టిదోగతి పాలుగావలసినదే.



హరి—చచ్చినట్లు నోరుమూసికొని యూరకుండవలసినదే కాని, పైకిఁ జెప్పుకొనుటకు వీలులేదు. చాలుఁక నడువుము.

కాశీ—నోరు మూయుదుము గాని, లోకము మూయుదుమా? రండాగర్భము రాజాంతఃపురమువలెను దెలియును.

(ఇరువురు నిష్క్రమింతురు)

---



2 వ రంగము—శయనగృహ[ము]

—:o:—

సర్వమంగళ ప్రవేశించు[ను]

---

సర్వ—ఆహా! నాభాగ్య మేమని కొనియాడుదును!

చ. చక్కనివాఁడు, రూపగుణసంపదలందు మనోహరుండు, పే
రెక్కినకీర్తిశాలి, పరమేశ్వరభక్తుఁడు, శాంతమూర్తి, నన్
మక్కువఁ జూచువాఁడు, జనమాన్యుఁడు. నాహృదయేశుఁడౌట, లే
దొక్కటి లోప మెయ్యెడ నహో! తొలినోము ఫలించెఁ బూర్ణమై.

ఇట్టి సకలసద్గుణఖని యగునామనోవల్లభునకు ద్విభార్యాయోగముపట్టెనని యాజోస్యుఁడు చెప్పినప్పటినుండియు నాహృదయ మాందోళనము జెందుచున్నది. అదియే పునర్వివాహయోగమైనచో నింత పరితపింపకుందును గదా! అకటా! ఒకవేళ నా జ్యోతిష్కుఁ డిట్లు చెప్పుటకు సంశయించి ద్విభార్యాయోగ మని మార్చి చెప్పలేదు గదా! ఏమైనను జేయఁగలిగిన దేమున్నది?

[బిల్వమంగళుఁడు ప్రవేశించును.]

సర్వ—(పీఠమునుండి లేచును.)

బిల్వ—దేవీ! నేఁడు తండ్రిగారు విద్యార్థులను బరీక్షించుచుండుటచే నింత తడ వైనది. కాని, నీ వదనపంకజ మట్లు వాఁడి యున్న దేమి కారణము?

సర్వ—మీ రాలసించి వచ్చుటయే.

బిల్వ—కాదు కాదు వేఱు కారణ ముండియుండును. అట్లే కానిచో,

గీ. నీటితరఁగలమున్కకు నీటు దక్కి
గాలితాకుకుఁ జంచరీకంబు లెడలి
మండువేసఁగిఘాకకు మలిన మయ్యు
సౌరభంబును జెడునొక్కొ! నీరజంబు.

సర్వ—(తనలో) అహా! నాథుఁడు నా మనోవైకల్య మెంతలో గ్రహియించెను!

బిల్వ—దేవీ! నీ వేమో దీర్ఘాలోచనము చేయుచుంటివి. నీ విచారకారణముం దెలిసికొనిన గాని నాహృదయము స్వస్థతఁ జెందదు.

సర్వ—నా మనస్సంకటమును మీ కడ నివేదింపక దాఁపఁ గల్గుదునా? కాని, యాఁడువా రింగితజ్ఞానశూన్య లనియధిక్షేపింతు రేమో యనిభయమగుచున్నది.

బిల్వ—ఎంతమాటాడితివి? నా యొద్దఁ జనవుగ నుండవలసినదే కాని, భయమేటికి? సందేహింపక చెప్పుము.

సర్వ—ఈ నడుమ వచ్చిన జ్యోతిష్కుని మీరు చూచి యుండిరా?

బిల్వ—నేను జూడలేదు గాని, తండ్రిగారివలన వినియుంటిని. వారు మహాపండితులనియు, నాజాతకపత్రముంగూడ చూచిరనియుఁ జెప్పిరి. ఏ మట్లడుగుచుంటివి?



సర్వ—మఱి యేమియును లేదు. వారు చెప్పినఫల మేమో మీ వలన వినవలయునని.

బిల్వ—నా కేమియును దెలియదు. కాని, తెలిసికొనవలసినంతయవసర మిప్పు డేమి వచ్చినది?

సర్వ—మన పరస్పరానురాగఫల మెట్లుండె ననిచెప్పెనో వినవలయునని యడిగితిని.

బిల్వ—అతఁడు చెప్పున దేమి? నీకు మాత్రము దెలియకుండెనా?

చ. నిను నెడఁబాసి యొక్కఁడను నిల్వఁగనోపదు నాదు మానసం
బనిశము సర్వమంగళ నిజాకృతి కన్నులఁ దాండవింప, నె
ప్పనికిని బోయిన న్మనసు పంతము వట్టి గతి న్మరల్చు, భా
మిని! యిఁక వెక్కు లేటికి? నిమేషము బాసి మనంగ నేర్తునే?

సర్వ—ఇప్పటివఱ కట్లే యున్నది. జీవితాంతమువఱకు నిట్లు నిరంతరాయముగ నుండునా, లేదా యనియే సంశయము గలుగుచున్నది.

బిల్వ—ఈ జనుఁడు నీ యధీనుఁడై యుండ నట్లేల జరుగకుండును? నీ యాజ్ఞచొప్పున మెలంగుట కంటె నాకుఁ బరమానందము కలదా?

సర్వ—నాథా! మీ సేవకురాలి నెంత మాటాడితిరి?

బిల్వ—హృదయేశ్వరీ! నీ వాజ్ఞాపించుటయును దప్పు గాదు; నే నట్లు మెలంగుటయును దప్పుగాదు. ఇటు వినుము.

చ. ఇరువురిభావ మొక్కటిగ నేర్పడి, యెల్ల గృహస్థధర్మముల్
గొరవడకుండ నల్పుచు, నకుంఠితకీర్తినికాయులై భువిన్

బరఁగెఱుఁగునట్టిసంపతు లపారశుభస్థితు లొందు నంచు సం
గరతలమందుఁ జెప్పె మును గవ్వడికిన్ హరి తత్త్వగీతముల్

సర్వ—మీరు సెలవిచ్చిన దాంపత్యధర్మములు నీతిదాయకంబులే యగును. కాని, యిద్దరుభార్యలున్న పురుషుం డట్టిధర్మమార్గానువర్తుఁడు కాఁగలఁడా?

బిల్వ—ఏకపత్నీవ్రతస్థుఁ డగునాతఁడే ధర్మస్వరూపుఁ డనియు, కర్మబద్ధుఁ డనియు, ప్రేమైకనిదానుఁ డనియు, పురుషుఁ డనియుఁ జెప్పనగును. తద్భిన్నుఁడు మృగప్రాయుఁడనియే నా యభిప్రాయము. దేవీ! ఈ యప్రస్తుతప్రసంగ మేమిటికో నాకు బోధపడుట లేదు.

సర్వ—అప్రస్తుతము గాదు. ప్రస్తుతమునే యుపక్రమించుచుంటి నిటు వినుఁడు. నేను గతదివసమున దేవతామందిరములో గౌరీపూజ జేయఁబోవుసమయమున జ్యోతిష్కుఁడు మీ జాతకపత్రికం జూచి ద్విభార్యాయోగ మున్నదని మామగారితోఁ జెప్పియుండెను. ఇదియే నా విచారకారణము.

బిల్వ—ఓసి వెఱ్ఱిదానా!

గీ. జోసి సెప్పినఫలములు బోసియాట
కత్తె చూపెడు మర్యాద కలియుగమున
పొట్టకూటికి గతిలేని పుంత గాసి
వాసి తెచ్చునె? యీ మేడిపండువృత్తి.

అట్లనుట జ్యోతిష్కులలో పండితుఁడును, వెలయాండ్రలో గుణవంతురాలును లేకుండు రని కాదు. నూటికి, కోటికి, నురడిన నుండ వచ్చునేమో! శాస్త్రజ్ఞానము లేనివానిచే జాతకఫలములఁ జెప్పించుకొనుటకంటె సోదె జెప్పించుకొనుట సమంజసము.



సర్వ—పంచాంగము లబద్ధము లైనను, నక్షత్రము లబద్ధములగునా?

బిల్వ—చక్కఁగ వక్కాణించితివి. పంచాంగము లబద్ధములే యైనచో, పాండిత్యములు నబద్ధములే. నక్షత్రము లబద్ధములే కానిచో, శాస్త్రములు నబద్ధములు కావు.

సర్వ—మీరు వచించినట్లా జ్యోతిష్కుఁడు సోదెగాఁడు కాఁడనియు, మహావిద్వాంసుఁ డనియు మామగారివలన వినియుంటిని.

బిల్వ—అయినఁ గావచ్చును. నేను నట్లే వినియుంటిని.

సర్వ—ఈతఁడు చెప్పినఫలమే యథార్థ మైనచో నప్పుడు మీకు నాపైఁ బ్రేమ నిలుచునా?

బిల్వ—అబ్బా! దీని కొఱ కెంత ద్రవిడప్రాణాయామము జేసితివి! ఇదియే జాతకములం జూపించికొనుటవలన సంభవించు నష్టము. ముం దెన్నఁడో రాజయోగము వచ్చునని విఱ్ఱవీఁగుటయును, దరిద్రయోగము వచ్చునని విచారించుటయునా? ఆ శాస్త్ర మిందు నిమిత్తమే పుట్టఁబడినదా? కాదు కాదు. మానవజీవితముయొక్క నాల్గవస్థలలో మూఁడువంతులు సంసారమున గడపి తక్కినదశాశేషము పరోక్షజ్ఞానసంపాదనమున కుపయోగింపవలయునని శాస్త్రకారుల యభిప్రాయము. కావున, నాయుఃప్రమాణముం దెలిసికొనుటకే శాస్త్రము పుట్టఁబడినది. ఐహికసుఖదుఃఖాదులు ప్రారబ్ధానుసరణముగ ననుభవింపవలసినదే గాని, త్రోసిపుచ్చుటకు సాధ్యము గాదు. చక్రవర్తి యైనను కర్మసూత్రమునకు బద్ధుఁడై యుండవలసినదే.

సర్వ—ప్రాణప్రియా! సర్వజ్ఞు లగు మీ కడ మాటాడఁగల్గుదునా?

బిల్వ—దేవీ! నే నిప్పటి కొకవేళ సర్వజ్ఞుఁడనే కావచ్చును. కాలకర్మవశమున ముం దెట్టి వింతమార్పులు నాకుఁ గలుగనున్నవో నేను మాత్ర మేమి చెప్పఁగల్గుదును? ఎచట పుట్టితిని—ఎచట పెరుఁగుచుంటిని—

(తెరలో) నాయనా! బిల్వమంగళా!

బిల్వ—(తుళ్ళిపడి) దేవీ! నాయనగారు వచ్చుచున్నారు. నీవు లేనిపోనిసంశయములు మనమున బెట్టుకొని కలత నొందక గృహకృత్యములనిర్వర్తింప లోని కరుగుము.

సర్వ—మహాభాగ్యము. (బిల్వమంగళునకు నమస్కరించి నిష్క్రమించును.)

[దామోదరపండితుఁడు ప్రవేశించును.]

బిల్వ—నాయనగారూ! కుమారుఁడు నమస్కరించుచున్నాఁడు.

[నమస్కరించును.]

దామో—చిరాయురస్తు. (కూరుచుండి) నాయనా! ఇటు నా దగ్గరగఁ గూరుచుండుము.

బిల్వ—(కూర్చుండి) నాయనగారూ! ఇట్లసమయమున దయచేసి రేమి?

దామో—(నవ్వుచు) అబ్బాయీ! భార్యాభర్త లున్నతావునకు సమయముం దెలిసికొనకుండవచ్చుట తప్పిదమే. కాని, నాహృదయోత్సాహము బట్టఁజాలకయును, నీతోఁ గొన్ని విషయములు ముచ్చటింపవలసియును రావలసివచ్చినది.

బిల్వ—(దోసి లొగ్గి) మహాప్రసాదము.

దామో—

చ. కలరు సమస్తశాస్త్రము లఖండముగాఁ దుదముట్ట నేర్చి, రాజులకడ నెత్తుబత్తెముల జుట్టెడువారు, మహాసభాస్థలిఁ

బిలువని పేరఁటంబుగఁ

సలిపెడివారు, పుత్ర! నిను ఒ

బిల్వ—తండ్రీ! ఇది యంతయును దమ

మును, నాశీర్వచనసామర్థ్యముం గాక వే ఱేమున్నది? దీనికి యస్కాము లగుతా మిట్లు నన్ను స్తుతిపాత్రుని జేయ శ్రేయోసంభవింపదా?

దామో—వత్సా! యుక్తియుక్తముగఁ జెప్పితివి. నా యానందము హృదయమునఁ బట్టఁజాలక వెల్లివిరిసి న న్నిట్లు ప్రేరేపించినది.

సీ. పున్నామనరకాబ్ధి మున్గి యుక్కుచునున్న
తండ్రినిఁ దరిఁ జేర్చుతరణి, కొడుకు
భవబంధములఁ జిక్కి పలవించి కృశియించు
పితను ముక్తునిజేయు ప్రెగడ, కొడుకు
అతిథిపూజానష్టుఁ డై వెత దిగులొందు
జనకుఁ గర్మఠుఁ జేయుచరువు, కొడుకు
అనపత్యదుఃఖాంధుఁ డై పరగతిఁ బాయు
తాతను గడ తేర్చునూత, కొడుకు
అట్టి యాత్మజుఁ గనులార నరయుకంటె
తనయుపల్కులు చెవులార వినుటకంటె
పుత్రునాశ్లేషసౌఖ్యంబు బొందుకంటె
ఘనతరానంద మింక వేఱు కలదె భువిని?

బిల్వ—తండ్రీ! మీరు సెలవిచ్చిన దంతయు స్వభావసిద్ధమే గాని, యింత యతిశయోక్తిగఁ జెప్పుట కేమున్నది? పుత్రుల నెత్తి పెంచి పెద్దవారలఁ జేసి విద్యాబుద్ధులఁ గరపి సిరిసంపదలఁ గూర్చిన తల్లిదండ్రులయెడఁ జూపవలసినకృతజ్ఞత యదియే కదా!

...కంటెఁ బెంచికొనినవా
...సహజము. కావున, నా యానం
...ుది. అదియునుంగాక, దత్తపుత్రు లత్తఱుం
...మాన్యమై యున్నను దైవము నాకు మాత్ర మట్టిద
...త్రశోకము దరి రానీయక సుగుణరాసి వగునిన్ను బ్రసాదించె
నని యువ్విళ్లూరుచుంటిని. అట్లే చిరంజీవివై యుందువు గాక!

బిల్వ—మహాప్రసాదము. నా కాజ్ఞాపించున దేమో కలదని సెలవిచ్చియుండి రద్దాని న్వినఁగోరుచుంటిని.

దామో—నాయనా! నే జెప్పఁబోవునవి నా కడసారి వాక్కులే. వినుము.

చ. వయసు గతించి వార్ధకము వచ్చుచునుండెఁ గ్రమక్రమంబుగన్
బయనము దప్పదయ్యె భవబంధములం దొలఁగించి, యెల్ల నీ
పయి వహియించి నన్ను నిరపాయతఁ గాశికిఁ జేర్పుమింక, ని
ర్భయముగ నింత కాల మెదపైఁ జెయి చేర్చుక నిద్రవోయితిన్.

బిల్వ—నాయనగారూ! మీ యాజ్ఞాప్రకారము సంసారభార మింతటినుండి నాపైఁ బెట్టికొందును. కాని, నేను సంసారము జక్కదిద్దుకొనుటయు, మీరు పై నుండి చూచుచుండుటయు నుభయులకు నానందదాయకము గదా, యింతలో కాశి కేగుట కంత తొందరేల! దీనికై మీ రాడిన యమంగళవాక్యము నాహృదయమును మిగుల బాధించుచున్నది.

దామో—పుట్టినవాఁ డెన్నఁటికిని గిట్టకుండునా? పుత్రులు పితృకర్మను బెండ్లివలె భావింపవలసినదే; విచారింపకుము. నాకైనను నైహికేచ్ఛ లన్నియు నశియించినవి. ఇంక పరోక్షజ్ఞానముం బడసి మోక్షమార్గముం జూచుకొనుటయే వివేకము. మఱియును "కాశ్యాం



తేమరణాన్ముక్తిః" అను సార్యోక్తి ప్రకారము కాశియందే మరణించి ముక్తిం బొందుట పరమార్థము. కావున, నీ విప్పు డట్టి యడ్డంకులను జెప్పక సంతోషపూర్వకముగ నన్ననిపినచో జీవితశేష మందే గడపుచు నవసానదివస మగుపౌషశుద్ధసప్తమీ దివసమున నీకై యెదురు చూచుచుందును. నాఁటి కక్కడకు వచ్చి యుత్తరక్రియల నిర్వర్తింపుము. మఱొకమాట—ఎవ రేయేశాస్త్ర మభ్యసింపవచ్చినను, జాతి లింగభేదములు పాటింపక, వారి కా యా శాస్త్రము లుపదేశింపుచు నీ పాండిత్యమునకు వన్నె దెచ్చికొని, కీర్తిం బొందుదువు గాక! అదియే శాశ్వత మైనది.

బిల్వ—(కన్నీరువిడచును.)

దామో—విచారింపకుము. ఇంతవఱ కెట్టి యమంగళములును నా చెవిని బడకుండ గడచిపోయినది. ఇఁక ముం దెట్టి యవాక్యములు, నప్రతిష్ఠలు వినవలసి వచ్చునో యెవ్వరు చెప్పఁగలరు? కాల మొక్కతీరున నుండునా? కావున, నా యావదాస్తికిని సర్వస్వాధికారపత్ర మొసంగెదను రమ్ము.

బిల్వ—చిత్తము. మీయాజ్ఞ శిరసా వహించితిని.

[ఇరువురు నిష్క్రమింతురు.]

రంగము—ధనరాజుగృహము.

---

ధనరాజు ప్రవేశించును.

ధన—అమ్మాయీ! చింతామణీ! ఏమి చేయుచున్నావే? అన్నా! నా మాట కొంచె మైనను జెవిని బెట్టవేమి కర్మమే? జపములు, తపములు, వ్రతములు—అహాహా! ఇ దేమో నా కయోమయ

ముగ నున్నదిగాని, దారి తెన్ను కనఁబడుటలేదు. నే ననుచున్న కొలఁదియును, దానిచేష్ట లది మానక నానాఁటికి పేరేఁగిపోవుచున్నది. ఏమనుటకును నోరు రాకున్నది. ఏ మనఁగల్గుదును? నాపైఁ బ్రేమ లేకుండెనా? కన్నతల్లినికంటె నెక్కుడుగఁ బ్రేమించుచున్నది. అజ్ఞానురాలా? కాదు-విద్యావతి. అయ్యో! సానికొంపకు సాలగ్రామము దాఁపురించినదికదా! ఈ గుణలక్షణములఁ బట్టి యోజింపఁగ నగ్రకులసంభవ యని సంశయము గలుగుచున్నది. పోని మెప్పటికైనను బెంచిన విశ్వాస మైనఁ జూపకుండునా?

[చింతామణి ప్రవేశించును.]

చింతా—అమ్మా! ఈ గురువునొద్ద నే నింకఁ జదువుకొననే.

ధన—ఏ మమ్మా! ఎందుచేత? ఆతఁడు మహాభాగ్యవంతుఁ డట్లనఁగూడదు.

చింతా—భాగ్యవంతుఁ డైనఁ గావచ్చును గాని, విద్యావంతుఁడు మాత్రము కాఁడు.

ధన—సరిసరి! గురువునకే పంగనామము బెట్టుచుంటివా? సర్వజ్ఞుఁ డగుగోపాలశర్మ నీ కింత తేలికగఁ గనఁబడుచున్నాఁడా?

చింతా—సర్వజ్ఞుఁ డైనచో, సార్వభౌమాస్థానపీఠము నే యలంకరించును గాని, సానివాడలో గురుత్వ మెందులకుఁ జేయును?

ధన—ఆతనికడ నున్న యజ్ఞాన మేమి? నీకు బోధ యగునట్లు చెప్పలేకుండెనా; లేక, చెప్పుట కిష్టములేక కృత్రిమబోధనము సేయుచుండెనా?

చింతా—తాను నేర్చినంతవఱకుఁ జెప్పినాఁడు. పైని జెప్పుటకు శక్తిచాలక గుట్టునకుఁ గట్టువడి పిష్టపేషణన్యాయముగ పాడినదే పాడుచు, చెప్పినదే చెప్పుచుఁ గాలక్షేపము సేయనారంభించెను. అదియటులుగాక, విద్వల్లక్షణ మాతనియం దొక్కటియును జూపట్టదు. అన్నియు నవలక్షణములే.



[తెరలో మంగళవాద్యములు.]

చింతా—అమ్మా! మనవీధి వెంట నుత్సవము వెడలుచున్నది చూచివచ్చెద నుండవే! [నిష్క్రమించును.]

ధన—అయ్యయ్యో! వచ్చినసరసుల నందఱి నిట్లే చెదరఁగొట్టినచో కులవృత్తి కూలిపోవును గదా! గోపాలశర్మ కోటీశ్వరుఁడు గాకున్నను, విటులఁ దెచ్చుటలో వివేకశాలి-చదువు సంధ్యలు చట్టుబండ లైనను, తార్పుడువృత్తికిఁ దగినబంటు-ఇట్టివానిని జేతులార విడుచు టెట్లు? పాపము! బిక్కమొగము వైచికొని వచ్చుచున్నాఁడు.

[గోపాలశర్మ ప్రవేశించును.]

గోపా—(తనలో) ఆహా! నా కెంత యాశాభంగ మైపోయినది!

సీ. చింతామణికి విద్య చెప్పునంతటిభాగ్య
మబ్బెనంచును మది నుబ్బుచుంటి
పాఠములో బ్బధించుపట్టున డగ్గఱఁ
గూర్చుండునని యెంతొ కులుకుచుంటి
గురుగౌరవంబున గుసుమకోమలి యిచ్చు
వీడెంబు గొని విఱ్ఱవీగుచుంటి
అలయికగానున్న యప్పుడప్పుడు దాని
పఱవుపైఁ బన్నుండి మురియుచుంటి
అన్నియాశలు నేఁటితో నంత మొంది
చల్లఁబడెఁ గాళ్ళు, దేహంబు సడలఁజొచ్చె
దిక్కులేదింక; కేల్మోడ్చి, దేవులాడి,
కోర్కె లీడేర బలిమిని గురుఁడ నౌదు.

అకటా! నా జీవిత మిప్పటికి రెండుదశలు గడచి మూఁడవదశ జరుగుచున్నది. మొదట, కమలాస్నేహఫలమును గాలసర్పము మ్రింగి వైచినది. తరువాత, భవానీమోహపాశము మాతంగకృపాణముచే వ్రక్కలై పోయినది. ఇఁక మూఁడవదగు చింతామణీముఖాబ్జచంచరీక మేటను మమ్మున వ్రాలనున్నదో! ఇఁక లాభము లేదు. మరణమే శరణ్యము. హా! దైవసంకల్పము!

ధన—ఏగకాఁడా! క్రొత్తపెండ్లికొడుకువలె నడుగులు లెక్కపెట్టుచు వచ్చుచుంటివేమి?

గోపా—నేఁడు చింతామణి "చదువక్కఱలే" దని నాపై నట్లు రోసరోస లాడుచుండుటకుఁ గారణమేమో నీకుఁ దెలియునా?

ధన—ఇదియా కారణము! చెప్పెదను వినుము. సుబ్బిసెట్టి చంద్రహారము, కట్టుకాసులపేరును దెచ్చి యిచ్చెననియు, మీ రేమియుఁ జేయించుట లేదనియు నాతో నప్పుడప్పుడు చెప్పుచువచ్చినది. అది మనసున రగులుచుండెఁ గాఁబోలు! కుత్తుతన మగుటచే నెవరిసాహస మెట్టిదో దాని కింకను దెలియకున్నది.

గోపా—(తనలో) అవును. సానికి డబ్బిచ్చువాఁడే సరసుఁడు గాని, విటుఁడు పండితుఁడైన నేమి, మహారాజైన నేమి? (ప్రకా) ప్రియురాలా!

ఉ. సెట్టిని మాటిమాటికి విశేషముగా నుతియించుచుందు, వె
ప్పట్టున నాకు నీఁ డతఁడు? పారము సెప్పెనె, పేరు దెచ్చెనే!
కొట్టున నుప్పు మిర్చియును గొల్చుచుఁ దప్పుడు లెక్కవెట్టువాఁ
డెట్టుల నీకు నచ్చె నిటు లెన్నఁడు బల్కకు మింక మీఁదటన్,



ధన—

చ. సరిసరి; యెంతమాట! బహు చక్కఁగఁ బల్కితి రాటకత్తెకుం
గురుఁ డన నొక్క గౌరవము, గోమటి యన్న నగౌరవంబునున్
ధరఁ గలదయ్యె! జాతి మత ధర్మము లెంచిన వృత్తి సాగునే?
సిరు లెవఁ డిచ్చునో, యతఁడె శీర్షముదన్నుమగండు వేశ్యకున్.

గోపా—(తనలో) ఓహో! రంగము చెడునట్లున్నది. (ప్రకా) ప్రియా! నేఁ జెప్పిన దొక్కటియును, నీ వర్థము జేసికొనినది మఱొక్కటి యాను. చింతామణి కలంకారములు సేయింప నాతఁ డొక్కఁడే సమర్థుఁడా? లోకమున బెక్కురుధనవంతు లుండవచ్చునని నాయభిప్రాయము.

[చింతామణి వేగముగఁ బ్రవేశించి]

చింతా—అమ్మా! ఎవ్వరో బిల్వమంగళమూర్తియఁట! తండ్రిగారిని కాశీయాత్రకుఁ బంపునిమిత్తము మనవీథి నుత్సవముతో నూరేగుచుఁ బొలిమేరవఱకును సాగనంపఁ బోయెనమ్మా! ఆ దివ్యమంగళమూర్తి యెంతసుందరుఁడే! అందులకుఁదోడు మహాపండితుఁ డని కూడ వినియుంటిని. ఆతనికడ విద్య నభ్యసించిన బాగుండును.

ధన—అబ్బో! వారు పండితులే గాక, ధనవంతులు కూడ నఁట! అందువలన నెన్నఁడును, నెన్ని యుత్సవములు జరుగుచున్నను గృహము వీడి యీవలకు రారఁట! అట్టిమహనీయులకడఁ జదువుకొన నీ కెట్లు లభ్య మగును? వారు మనయిండ్లకు రాసంశయింతురు.

చిం—పోనిమ్ము; నేనే యక్కడకుఁ బోవుదును.

ధన—వారికాఁపుర మగ్రహారము. దినదిన మంతదూర మెట్లుగిరాఁగలవు? ఇంత కర్మ మేమి వచ్చినది? జీతభత్యములు లేనిగురు వీతఁ డుండ, మఱొక్క గురు నాశ్రయింప నేల? ఇంతకును నోరు దెఱచి యడిగిన వా రేమనునో!

గోపా—(తనలో) దీనికి నాయందు సంపూర్ణాభిమానము కలదు. బాగుగ నుపక్రమించినది.

చింతా—నీ వెన్ని చెప్పినను నా కీతనియొద్దఁ జదువుకొన నిష్టము లేదు.

గోపా—(తనలో) ఇఁక దీని తిక్క తిరుగునట్లు లేదు. మఱొక దారి త్రొక్కి చూచెదను. (ప్రకా) చింతామణీ! నీకు బిల్వమంగళమూర్తియొద్ద విద్య నభ్యసింపఁ గుతూహలము సంపూర్ణముగఁ గలదా?

చింతా—(ఊరకుండును.)

ధన—అ దేమి మూఁకుతనమే? ఏమో యడుగుచున్నారు; సమాధానము చెప్పవేమి?

చింతా—నీవే చెప్పవచ్చును.

ధన—చదువుకొనుదానవు నీవు గాని, నేను గాను. (గోపాలశర్మతో) చూచితిరా యీ పట్టు! నేఁ జెప్పినదే కారణము.

గోపా—(తనలో) అకటా! నే నున్నయవస్థలో దీని కే మర్పింపఁగలను? ఇంత కాలమునుండియు గురుదక్షిణాపూర్వకముగ నా యభీష్ట మీడేర్చుకొనఁ దలఁచితిని. కాని, నేటితో నట్టి యాశ భగ్నమైపోయినది. ఈ సుందరాంగికి బిల్వమంగళమూర్తికడ విద్య నభ్యసింపఁ గుతూహలం బొడముటచే నా యాశాబీజము తిరిగి మొలకెత్తుచున్నది. (ప్రకా) చింతామణీ! బిల్వమంగళమూర్తి నా కాబాల్యమిత్రుఁడు; ఆతఁడును, నేనును, నొక్కయొజ్జకడనే విద్య నేర్చితిమి. నీ కిష్టమున్న నే నాతని నొప్పింపఁగలను.

చింతా—మీ యనుగ్రహమున్న జదువుకొందును.



గోపా—నీ వే మాజ్ఞాపించినను జేయుటకు సర్వసిద్ధముగ నుండఁగ, సంశయ మెందులకు? నే నాతనికడ కిదె పోయి వచ్చెదను. (నడచుచు తనలో) దామోదరపండితులు పెంచికొనిరనియే వింటినిగాని యెన్నఁ డాతనిఁ జూచియుండలేదు. నేనును, సుందరుఁడును జదువుకొను దినములలోఁ దా నే పుత్త్రవానిని పెంచికొనునో, ఇంటి పే రేమో, తండ్రి పే రేమో, వాసస్థల మేమో, మా కొక్కనాఁడు నుపాధ్యాయులు చెప్పియుండలేదు. ఇప్పు డాతని నే మిషమున సందర్శింతును? దాని కేమి; ఎట్లో చూడవచ్చును. ఇంత సన్నాహమును జేసికొని వెళ్ళినపిదప గణికకు విద్యగఱపుట కంగీకరించునో లేదో తెలియకున్నది. కానిమ్ము; దైవముపై భారముంచి ప్రయత్నించి చూచెదను.

[నిష్క్రమించును.]

(తెరలో) ధనరాజూ!

ధన—(తనలో) అదిగో! సెట్టి వచ్చుచున్నాఁడు. దీని నెదుటఁ బెట్టుకొని యాతనితో మాటాడరాదు. (ప్ర) అమ్మాయీ! నీవు లోనికేగి యన్నప్ప నిటు రమ్మని చెప్పుము.

చింతా—అట్లేనమ్మా! (నిష్క్రమించును.)

ధన—సెట్టిగారూ! దయచేయండి! సంకోచించుచున్నా రేమి?

సుబ్బి—(ప్రవేశించి) క్రొత్తసరసు లెవ్వరో వచ్చిరని సంశయించుచున్నాను.

ధన—మీ కంటె నా కధికు లెవ్వ రున్నారు?

సుబ్బి—కావుననే, యొక సరకుఁ జూపి, యింకొక సరకిచ్చితివి.

ధన—అది యంతయు సెట్టిగారి సహవాసదోషమే గాని, మఱొకటి కాదు. దుకాణముమీఁది తళుకుసరకును మచ్చు జూపి, కొట్టులోని తీసివేతసరకు నిచ్చుట మీరు నేర్పినదే.

సుబ్బి—అడవిలో పెద్దపులి యెంతలోకువయో, ఊళ్లో కోమటి యంత లోకువ. నీ వ్యవహారము మా వ్యవహారమును మించిపోయినది. చెప్పికొన్నచో సిగ్గు. కలవాణి యింట్లో కన్నెఱిక మేర్పాటుచేసితి నని చెప్పి, యన్నప్ప కాఁడువేషము వేసి పంపెదవా? నా కా కొజ్జా తోడనా సరసము!

ధన—(నవ్వును.)

సుబ్బి—నీవు నవ్వుచుంటివిగాని, నాకు మాత్రి మేడ్పు వచ్చుచున్నదిసుమా! అప లాడంగితొత్తుకొడుకు. దానికిఁదోడు మా కిద్దఱికును జిక్కు యెదురు.

[అన్నప్ప ప్రవేశించును.]

అన్న—ఇదిగో! నా సరసుఁడు వచ్చినాఁడే?

సుబ్బి—నీ సరసము మండినట్టే యున్నది. కలచెదవా?

అన్న—గిల్లినప్పుడు కలవకుండునా? అంతవఱకు సంతోషింపవలసినదే. ఇంకను నీ యదృష్టము బాగున్నది. లేకున్న, గొంతుముడి తెగఁగోసికియుందును.

ధన—(నవ్వును.)

సుబ్బి—నీ బ్రతు కంతే.

అన్న—ఓహో! సానివాడలో నిట్టిసరసుఁ డున్నప్పుడు నా బ్రతుకున కేమి లోపము!

సుబ్బి—ధనరాజా! నవ్వుటయేనా, వీనినోరు మూయించెదవా?

ధన—అన్నప్పా! నీ వావలకు వెళ్లెదవా, లేదా! ఊరకున్న కొలఁదియును జేఱ్ఱిగుచున్నావే! చాలుఁజాలు! ఆ వామనమూర్తి గాఁడికి నీకే సరిపోయినది

సుబ్బి—(చంకలు కొట్టుకొనును.)



అన్న—నీ పొగ రణఁచెద నుండుము. నిన్నల్లరి చేయకున్న నా పేరున బిలువకుము. (నిష్క్రమించును.)

ధన—సెట్టిగారూ! అమ్మాయి మిమ్ములను బరిహాసము జేయవలయు నని యట్లు చేసినది. కోప ముంచికొనకుఁడు.

సుబ్బి—(కన్నులు చిగిలించి నవ్వుచు) అబ్బో! అబ్బో! వేళాకోళమే! మన సంగతి తెలిసినదన్నమాటే!

ధన—అమ్మాయి కొక్క కోర్కె యున్నదఁట! అది తీరునో, లేదో యని సంశయించుచున్నది.

సుబ్బి—(తనలో) ఇదేమి దేవుఁడా! మరల నేమైనఁ జేయించుమనునుగాఁబోలు! ఇప్పటికిఁ గొంప దోఁచుటయేగాని, కొంగైనఁ దగిలింపలేదు. అట్లయినను గొంతభ్రమ తీరియుండును.

ధన—సెట్టిగారి కాలోచనలోఁ బడినట్టున్నది.

సుబ్బి—అబ్బే! నవ్వొక్కువగుటచే డొక్కఁ పట్టినది. నీవు చెప్పవలసిన దేమో చెప్పుము; వినుచున్నాను.

ధన—సెట్టిగారు మాటిమాటికి నింటికి వెళ్ళకుండ సర్వదా, యిల్లరికపుటల్లునివలె నిక్కడనున్న బాగుండునని దాని కభిలాషముగ నున్నది.

సుబ్బి—(చంకలు కొట్టుకొని) ఇంతకంటెనా? ఇంతకంటెనా? నేఁడే చింతామణిపేర నా యావదాస్తియును గూడ వ్రాసియిచ్చెదను గమ్ము

ధన—(తనలో) ఈతని కింతతో భరతవాక్యము చెప్పవచ్చును. [నిష్క్రమింతురు.]

---

# శ్రీ కృష్ణ లీలా శుకము



## చతుర్థాంకము.

### మొదటిరంగము.

[మాధవుఁడు, సుబ్బిగాఁడు ప్రవేశము.]

సుబ్బి—మెల్లిగా కబుర్లు సెపుతూ, యీ తోట్లోకి లాక్కొచ్చినా వెందు కేంటా? కొత్త వేంటి?

మాధ—కొత్తానా, దుమ్ము లేరగమొడుత్తానా?

సుబ్బి—ఎందు కేంటి! నీ యబ్బ సొమ్మెట్టినా వంట్రా?

మాధ—ఇంక గమ్దనం సెయ్యాక, నా మా టినుకుండి, నా బాగ మెట్టు.

సుబ్బి—ఓ రబ్బో! ఇదంటోయ్! తెల్సింది. పెట్టెతో పెట్టెడు సొమ్మెట్టుకుపోయి, నీ కింకా బాగం గావ్వాలా? ఈపా లడిగినావంటే, ఆ కుఱ్ఱోడికినాగ బాగ మెడ్తానన్నమాటే.

మాధ—నీ బెదిరింపులకు సావటానికి బ్యాపనబొట్టెడు కాఁడు. ఈడు మాదవుడుగోడని తెల్సుకో. మాదివుడుగోడి తమాసా యెఱుంగుదువా? మరిడిజాడ్డమంతమనిసి. మునిసీబుగారితో సెప్పి ములుకు లిరగ్గొట్టింతానన్నమాట! ఎందుకొచ్చినబాద! నా మాటిన్ని, బాగ మెట్టు.

సుబ్బి—అత్తమాన్ను బాగం బాగ మంటా వేటో! సచ్చినోడు నీ బాగం; సరుకులన్ని నా బాగం—ఇంకా బాగ మేంటి.



మాధ—నీ కెంతూకుందిరా! ఈ దారి నొత్తన్నావా? ఇంకే; సాలుసాలు. సచ్చినోణ్ణి సన్నసన్నంగా, అయ్యగోరింటికా డడెయ్యమని యిప్పుడు నా బాగ మంటావా?

సుబ్బి—నీ కిట్టమై ఒట్టుకుపోనావా నేదా; ఆ మాట సెప్పు మఱి.

మాధ—ఈ యవారం పదిమందిలోకె త్తే పరువు పోద్దిసుమా? నా మా టిని గడుద్దనంకూటలు సెప్పక పంచుగుందారి పద.

సుబ్బి—అయితే నీ వట్టుకుపోయినసచ్చినోణ్ణి నీవు తీసుకురా; నే నట్టుకుపోయిన సొమ్ములు నే నొట్టుకొత్తాను. అప్పుడు చమంగా పంచుగుందారి.

మాధ—ఇప్పుడా సచ్చికో డెల్లా గొత్తాము? అయ్యగోరి కడు లెత్తినాదికామో లిల్లిడిసే పోనాడు.

సుబ్బి—అయితే నీకు బాగం నేదన్నమాటే.

మాధ—ఎందుకు నేదు? ఈ తగు వెంకడితో సెపుదారి పద; యేం సెపుతాఁడో!

సుబ్బి—ఆడిదగ్గిరికి రానానికి నా కవసరం నేదు. నీ దిక్కున్న సోట సెప్పుకో.

మాధ—నా దిక్కున్నసోటే సెప్తాను; రా. [చేయి పట్టి లాగి కొనిపోవును.]

ఇద్దఱు నిష్క్రమింతురు.

## రెండవరంగము.

---

### ఉద్యానగృహము.

(బిల్వమంగళుఁడు, సర్వమ్మంగళ ప్రవేశింతురు)

బిల్వ—దేవీ! సంసారభార మింతకాలమునుండియుఁ దండ్రిగారిపై నుండుటచేఁ గష్టనిష్ఠురము లేమియుఁ దెలియలేదుగాని యిప్పుడు నన్ను మిక్కిలి యలయించుచున్నవి సుమా!

చ. జనకులు దస్తు, శిస్తు పరిపాలనఁ జక్కఁగ నిర్వహింపుచున్
దనుపుచు నర్థికోటి వరదానములన్, మొగసాల నున్నభూ
జనుల వివాదము ల్గసిమసంగుచు నెల్ల భరంబుఁ దామె గై
కొని, నను రాజపుత్రు గతిఁ గోమలలీలలఁ బెంచెఁ బ్రేమతోన్.

సర్వ—నాథా! మీకే మాగర్భశ్రీమంతులు. కొంతకాలమైనను దండ్రిగారినీడను సుఖించితిరి. నాకు మాత్ర మత్తగారి యండ నుండు నానందభాగ్యము కలుగలేదు గదా!

బిల్వ—అశివా! నే నాగర్భశ్రీమంతుఁడననియా నీ తలంపు! కాదు కాదు. నా పడినపాట్లు భగవంతున కెఱుక. నా యట్టికష్టజన్ముఁడు మానవసృష్టి నెందును గలుగఁబోఁడు. నా జీవితచరిత్రము వినిన నీ వచ్చెరువొందక మానవు. సంగ్రహముగఁ జెప్పెద వినుము.

పుట్టితి వాసుదేవునకుఁ బుత్రుఁడనై తొలుదొల్త, నాదటన్
గిట్టె మదంబ యొక్క కలికిం గని, నాకుఁ బదేండ్లురాకమున్
గట్టికొనె న్మఱొక్కతను గాలము మీఱిననాదుతండ్రి, పై
నెట్టులఁ దెల్పువాఁడ, నతిహేయము, పాపము, ఘోరకృత్యమున్

సర్వ—(ఆత్రముతో) నాథా! ఘోర మేమి? మారుతల్లి విషప్రయోగముం జేసెనా యేమి?



బిల్వ—అట్లే యైనచో నా జన్మమునకుఁ గష్టము లనునవియే లేకుండును. కష్టానుభవము వేఱురీతి నుండ నట్లేలజరుగును? సాంతముగఁ జెప్పెద వినుము.

ఆ. తండ్రి యూరలేని తఱి నిరీక్షించి, న
న్నొక్కమాలచేత నొంపఁదలఁచి
మారుతల్లి ప్రేమ మాన్యమ్మునకుఁ బంప
మాయఁ దెలియలేక మసలినాఁడ.

సర్వ—ఆహా! మీ రాగర్భశ్రీమంతు లనియే యనుకొనుచుంటినిగాని, యింత చిత్రచరిత్రము కలదని యెఱుఁగను గదా! నాథా! నా కింతకాలమునుండియు నేల చెప్పక దాఁచితిరి? తరువాత తరువాత?

బిల్వ—ఆ స్థితిగతులు తలంచుకొన్న నాకుఁ బట్టరానిదుఃఖము పొంగి పరలోకవాసిని యైనమాతృదేవత జ్ఞప్తికి వచ్చును. అబ్బా! తిరిగి నే నిప్పు డచ్చోట నా కష్టదశ నున్నట్లు బాధ నొందుచుంటిని. అకటా! దైవచిత్రము!

సర్వ—అయ్యో! ఎంత యవివేకురాలను! మీ కిప్పుడు లేనిపోనిమనస్సంక్షోభముం దెచ్చిపెట్టితిని గదా!

బిల్వ—దేవీ! ఇఁక ముందు చెప్పఁబోవువృత్తాంత మానందదాయకమై, యీమనోవ్యథం బోనణచు నిటు వినుము.

చ. పొలమున కేఁగి వచ్చుతఱి పోటరిమాలఁడు పత్నిఁ గూడి, వి
హ్వలగతి త్రోవ నడ్డువడి వందన మంచు, దయాంతరంగుఁడై
కలతెఱఁగెల్లఁ జెప్పి, నను గాచెను మృత్యుముఖంబునుండి యో
చెలి! యిది యెల్ల మాతి దగు చిత్తవిశుద్ధియుఁగద్పుచల్వయౌ

సర్వ—ఆహా! మాతి పంచమకులసంజాతయైనను, నెంతపూ[illegible]లు: ఆమహామాత నామాక్షరములు సువర్ణాంకితములై యాచంద్రతారార్కములుగ వెలయుఁగాక! నాథా! తరువాత నేమి జరిగినది?

బిల్వ—పిదప నా కెందు బోవుటకుం గతి దోఁపక మద్విద్యాగురువు లగు నీదామోదరపండితులకు నా దుర్దశం దెలుప వచ్చితిని. అందుపై వీరనపత్యులగుకతంబున నా కభయమ్మొసంగి దత్తపుత్రునిగ స్వీకరించిరి. ఇదియే నా పూర్వచరిత్రము!

సర్వ—ఛీ! ఛీ! ఈ పునర్వివాహదురాచారమూలమున దేశమధోగతి పాలై ప్రేమప్రవాహము గట్టువడిపోయినది కదా!

బిల్వ—(నవ్వి) ఓహో! సతీ! ప్రకృతిలోకతత్త్వవిమర్శనములోనికి దిగుచుంటివే! పూజ్యులను నిందింపరాదు. ఇంక నావృత్తాంతమును మఱచిపొమ్ము. నేఁడు విద్యార్థుల కనధ్యయనదివసము గదా యని విశ్రాంతిగఁ గూరుచుండ మంచి కాలక్షేపముం జేసితివి.

[కేశవుఁడు ప్రవేశించును.]

కేశ—దేవా! ఎవరో వచ్చి మీ రాకకు నిరీక్షించి మన పాఠశాలలోఁ గూరుచుండిరి.

బిల్వ—వచ్చుచుంటి నని చెప్పుము. కాదు-వారినే యిటకు దయచేయుమని చెప్పుము.

కేశ—చిత్తము. [నిష్క్రమించును.]

బిల్వ—దేవీ! నీ వంతర్గృహమున కేగుము. నేనును నించుకసేపటిలో వచ్చెదను.

సర్వ—దేవరయాజ్ఞ. [నిష్క్రమించును.]

[గోపాలశర్మ ప్రవేశించును.]

గోపా—(బిల్వమంగళుని జూచి తనలో) ఔరా! ఏమి యీ వింత! ఈతఁడు నాకుఁ గృతపరిచయునివలెఁ గన్పట్టుచున్నాఁ డెవ్వరై యుండునొ చెపుమా! ముఖలక్షణములు సుందరునిఁ బోలియున్నవి. ఒకవేళ నాతఁడే యగునా? ఆ! ఏమి నా దుర్భ్రమ! వధింపఁబడిన



వాఁడు మరల బ్రతుకునా! కాదు కాదు మానవవ్యక్తులలో మేనమామపోలిక లుండుట సహజము. అయిన నీక ముందన్నియుఁ దెలియఁగలవు. నే నింతలో—

బిల్వ—మిత్రమా! గోపాలశర్మా! ఏమి సంశయించుచుంటివి? రమ్మిటఁ గూరుచుండుము. ఎన్నిదినములకుఁ గనఁబడితివోయి!

గోపా—(ఆశ్చర్యమునటించి తనలో) ఊఁ! నిజముగ సుందరుఁడే; సందియము లేదు. కంఠస్వరమే చెప్పుచున్నది. కాని, యెట్లు బ్రతికివచ్చెను చెపుమా? (కూరుచుండును.) మిత్రమా! నిన్ను గుర్తుపట్టలేకపోయితినోయి! మన గురువుగారు నిన్ను దత్తస్వీకారము జేసికొనినపిదప తిరిగి నే నిక్కడకు వచ్చుటయు, నిన్ను జూచుటయు లేకపోవుటచే నీ వగునా కాదా యని సంశయము కలిగినది.

బిల్వ—నాయందప్పటికి నిప్పటికి నేమైన మార్పు లగపడుచున్నవా?

గోపా—లేకేమి? సవతితల్లి ప్రేమకును, పెంచికొనినవారి ప్రేమకును గల వ్యత్యాస మవయవసౌష్ఠవమునందు జూపట్టకుండునా?

ఆ. సవతితల్లి యొసఁగు సరసాన్నములకంటె
ధాత్రి ప్రేమనిచ్చు మాత్రి యధిక
మంతకంటె రుచ్య మమ్మ పోసిన గంజి
దానికంటెఁ దీపి దారపల్కు.

బిల్వ—మిత్రమా! మిగులఁ జక్కగఁ జెప్పితివోయీ! కాని, యింత కాలమునుండియు నీ వేమిచేయుచుంటివి?

గోపా—మా తం[illegible]గు స్వర్గస్థులైనందున [illegible]సారభారము మీఁదఁబడి యూపిరా[illegible] జేయుచున్నది.

బిల్వ—ఆ విషయమై నాకుఁ జెప్పనక్కఱలేదు. తండ్రిగారు కాశీకేగుటచే సంసారానుభవము నాకును దెలియవచ్చినది.

గోపా—అవును. నే నిదివఱకే యెఱుఁగుదును. నీవు తండ్రిగారిని సాగనంపుటకై శ్రీకాకుళపువీధి నూరేగుచు వచ్చుచుండఁ జూచితిని

బిల్వ నీ వప్పు డెందుంటివి?

గోపా—నిజము చెప్పిన నవ్వుదువేమో?

బిల్వ—ఏల నవ్వుదును? అంతటి నగుబాటుపని నీవు మాత్ర మేమి చేయుదువు?

గోపా—అట్లయినఁ జెప్పెదవినుము. మా గ్రామమున చింతామణియను వారయువతికిఁ బుష్పబాణవిలాసమును బాఠము సెప్పుచుంటిని.

బిల్వ—(నవ్వి) అబ్బా! ఎంత తప్పుచేయుచుంటివి! నే నిందున కేనా పరిహసించుట! బాగు! నేర్చికొనిన విద్య పరుల కుపదేశించుటకుఁ గాని, హృదయమున జీర్ణింపఁ జేసికొనుటకా?

గోపా—నా సంశయ మది కాదు. ఆఁడుదానికి-అందుపై, వారకాంతకు—శాస్త్రవిరుద్ధముగ సంస్కృతవిద్యం గఱపుచున్నందున కధిక్షేపింతువని.

బిల్వ—ఎంత వెఱ్ఱివాఁడవోయి! విద్య లొకరి సొమ్మా? ఎవరి కిష్టమున్న విద్య వా రభ్యసించియే తీరవలయును. నేను గూడ నీవలె నిట్టి వెఱ్ఱితలంపునఁ బడుదునని మా తండ్రిగారు జాతి లింగ భేదములు పాటింపక, యెవ్వ రే శాస్త్ర మభ్యసింపవచ్చినను, నిరభ్యంతరముగ నుపదేశించుమని యంత్యోపదేశము జేసి యుండిరి.



గోపా—(తనలో) ఆఁ! ఇఁక త్రోవకు వచ్చినాఁడు. మనప్రయత్నము నిరంతరాయముగఁ గొనసాగుటకు సందియము లేదు. (ప్రకా) అటులయిన నా సందేహము దీరినది. నే నిప్పుడు వచ్చిన పని వినుము. చింతామణికి నే జదివినంతవఱకుఁ గాళిదాసత్రయమును బూర్తిగఁ జెప్పితిని. ఇంకను పై గ్రంథములం జదువ దానికిఁ గుతూహలము కలిగి నా బాల్యమిత్రుఁడవగుటచే నిన్నిందుల కొప్పింప నన్ను బ్రార్థించినది. కావున, నా మాట త్రోసివేయక దాని యభిలాష మీడేర్పుము.

బిల్వ—దానికి నావృత్తాంత మెట్లు తెలిసినది?

గోపా—నీ పాండిత్యప్రకర్ష లోకమే వేనోళ్ల జాటుచున్నది. అదియుంగాక, నాఁ డూరేగుతఱి నిన్ను జూపి మన బాల్యస్నేహమును, విద్యాభ్యాసమును, గూర్చి నేను గూడ తెలిపితిని.

బిల్వ—మిత్రమా! దీని కింత యుపన్యాస మెందులకోయి! నీవు చెప్పుచున్న చెప్పకుందునా?

గోపా—నీవు యోగ్యుఁడవు కావున, నట్లంటివి కాని, యందఱు నీవలె నుందురా? నీ కింకను లోక మెట్టిదో తెలియకున్నది. ఇటు వినుము.

సీ. కవిసింహుఁ డొక్కఁ డుద్గ్రంథంబు రచియింప
దోషము ల్వెదకెడు దుష్టుఁ డొకఁడు
ఆస్థానపండితుం డర్హతఁ వసింప
ఈసితోఁ గొండెము ల్పేర్చునొకఁడు
ఆశుధారాప్రౌఢు లవధానములు సేయ
కన్నీరు బొటబొటఁ గార్చునొకఁడు
భాషాప్రచారకు ల్ప్రకృతిలీలలు వ్రాయ
నిష్ప్రాహీ యని లోన నేడ్చునొకఁడు

ఇట్టి దుష్టు లసూయతాహీనమతులు
కుటిలకర్ములు భారతికుక్షిఁ జెఱుపఁ
బుట్టియుండిరి భారతభూమియందు
కలరె? నినువంటిపండితుల్ జెలిమికాఁడ!

బిల్వ—నీవు నా యందు గలస్నేహాభిమానమున నట్లు ప్రశంసింపుచుంటివి గాని, విద్యావంతునకుఁ దా నభ్యసించినవిద్య శిష్యుల కుపదేశించి తనయంతవారిని జేసి కీర్తి నిబడయుటకంటె నానందమేమున్నది?

గీ. సకలవిద్యాప్రపూర్ణుఁడై సాధువృత్తి
నెల్లజీవులఁ దనపోల్కి నెంచి, లోక
మాన్యుఁడై, నిష్కలంకప్రభావుఁడైన
పండితుం డేలు సత్కీర్తి, పరమపదము.

గోపా—మిత్రమా! చాల ప్రొద్దయినది. చింతామణి నాకొఱ కెదురుచూచుచుండును. ఇఁక నేఁ బోయివచ్చెదను; దయ యుంచుము.

బిల్వ—నాఁటికి నేఁడు కదా కనఁబడితివి! ఊరక తొందరపడెద వేటికి?

గోపా—చింతామణి యీ కబురు విన్నఁగాని భోజనము సేయనని చెప్పినది. అందుచే వేగముగఁ బోవలయును, నేఁటితో నైనదా? ఇఁక ముం దనేకసారులు సమావేశము కావచ్చును.

బిల్వ—సరియే! వెడలిరమ్ము.

ఇరువురు నిష్క్రమించిరి.

---



## చింతామణి గృహము.

---

[చింతామణి కంబళమున గూరుచుండును.]

చింతా—

చ. ఎవని మదీయభాగ్యమని యెంచి తిరంబుగ నమ్మియుంటి, నా
ప్రవిమలమూర్తి నా హృదయభావ మొకింత గ్రహింపలేక, న
న్నవిరళదుఃఖసాగరమునందు మునుంగఁగవైచె, నక్కటా!
కవిగనలేనిచోటు రవిగాంచునె యందు రిదేటిమాటరో!

అహా! దైవమా! నా కెట్టి యిడుమలం దెచ్చిపెట్టితివి! సకలశాస్త్రరహస్యవేది యగు బిల్వమంగళమూర్తి నాపూర్వజన్మసుకృతఫలమున గురువై, విద్యలగుట్టెల్లఁ దెలుపుచుండ నీ వేటికి విఘ్నము సంపాదింపఁదలఁచితివి! అయ్యయ్యో! ఓరీ! మదనా! నీ బ్రదుకు బుగ్గిగాను. శంకరుని నేత్రాగ్నిజ్వాలం బడి బస్మీభూతుఁడవై యనంగుడవైనను, నీ దొంగపోటులు మానవైతివి గదరా? ఛీ! క్రూరకర్మా! నీ యధికారమద మాఁడుదాన నగునాకడఁ జూపిన నేమి లాభము! నీకు సాటి యగుమేటి-పరాక్రమశాలి-మహాపండితుఁడు-పవిత్రచరిత్రుఁడు—బిల్వమంగళమూర్తి-అతనికడకుఁ బొమ్ము; పౌరుషము కలదేని యెదిరిపోరుము- నీ బాణముల ద్రుప్పువదలించుకొనుము-బాహువుల తీట బాపికొనుము-హా! బిల్వమంగళా! నీవే నాప్రాణరక్షకుఁడవు. నే నబలను—అజ్ఞానను—అనాథను—దాసిని—రక్షింపుము-దయ జూడుము. సుమాయుధున కాహుతనై పోవుచుంటిని.

[తటాలున బిల్వమంగళుఁడు ప్రవేశించును.]

చింతా—(ఉలికిపడి లేచి) అహో! గురుసార్వభౌములు దయచేసియున్నా రేమి నా భాగ్యము? ఆర్యా! మీ శిష్యురాలు మ్రొక్కుచున్నది. ఈ పీఠము నలంకరింపుఁడు.

బిల్వ—చింతామణీ! ఈ ప్రత్యుత్థానము లేమిటికి? వలదు వలదు. నన్ను లాతివానిగ భావింపవలదు.

చింతా—మీ యపూర్వాగమనవిశేషమున నేఁడు మహాపర్వదినమువలె నున్నది. (తనలో) హృదయమా! అందనిఫలమున కడియాసపడెదవేల? ఒక్కింతసేపు చలింపక నీ మర్యాద గాపాడికొనుము.

బిల్వ—(తనలో) ఓహో! ఈ సుందరాంగి స్తోత్రపాఠములు నామనోరథమున కంతరాయసూచకములుగఁ గన్పట్టుచున్నవి కదా! కానిమ్ము. (ప్ర) చింతామణీ! నన్నింత ప్రస్తుతింప నేటికి? ఎన్నఁడైన నింతలేని యాతురులింత కలుగునా?

చ. చదువఁగ నాగృహంబునకు సంతతముం జనుదెంచుదాన, వే
మది నిటు నేఁడు భూమిఁ బొరలాడుచు, నూర్చుచు, సోలియుంటి; వో
మదవతి! నాకుఁ దెల్పు మనుమానము బొందకు మూర్తి గ్లానితో
పదయుగళంబు నొచ్చెనొకొ? పాఠము లేమదిఁ బట్టకుండెనో.

చింతా—ఆర్యా! నేఁడు దేహ మస్వస్థముగ నుండుటచే మీయాశ్రమమునకు రాఁజాలనైతి. క్షమింపుఁడు.

బిల్వ—నాకునట్టి సంశయమే మనసున గలిగి యొక్కపరి చూచిపోవలయునని నీ యంకమునకుఁ జేరవచ్చితిని.

చింతా—అయ్యో! ఎన్నఁడును వీధిగుమ్మ మెట్టియెఱుఁగని యనంగసుకుమారులు నానిమిత్త మెంతశ్రమపడి వచ్చియుండిరి!

బిల్వ—బాగుబాగు! నా శ్రమ కేమి? నీవు సేమముగ నుండుటయే నాకుఁ బరమసంతోషము. కాని, నీవు ప్రతిదిన మంతదూర మెంత శ్రమపడి వచ్చుచుంటివో, నా కిప్పు డనుభవమునఁ దెలియవచ్చినది. జరిగినదాని కిప్పు డేమి చెప్పిన నేమి లాభము?



చింతా—అయ్యా! ఎంతమాట సెలవిచ్చిరి?

గీ. సకలవిద్యారహస్యబోధకులు నాకు
గురువులౌటను జిత్తంబు బరిఢవిల్లి
పారలౌకికవిజ్ఞానపథము దెలిసె;
కష్టములు లేక ఫలములు గలుగు టెట్లు?

బిల్వ—కాంతాశిరోమణీ! నీయట్టిబుద్ధిమతి శిష్యురాలగుట నా భాగ్యము గాని, నీ భాగ్యము గాదు. ఏమందువా?

గీ. నన్ను మించినగురువు లున్నారు నీకు;
నిన్నుఁ బోలినశిష్య లేదెన్న భువిని;
పడఁతి! నినుఁబట్టి నా పేరు కడలుముట్ట
విస్తృతంబయి, తిరమయి, వినుతిగాంచె.

కావున,

గీ. దినదినంబును నే నేగుదెంచి యిట్లు
నేర్పుచుండెదఁ బాఠము ల్ప్రీతితోడ
నించుకంతయు సందియ మెంచఁబోక
మదిని హత్తించు నా మాట సుదతి! నిజము.

చింతా—అయ్యా! ఇవేటిమాటలు! నన్ను బరీక్షించుటయా, హాసించుటయా?

బిల్వ—కాదు కాదు-యథార్థమే పల్కుచుంటినిటు వినుము.

సీ. ప్రాసాదమున దివ్యవాసన ల్వెదఁజల్లు
　　　పూసెజ్జఁ బవళించు భోగవతివి!
సెలయేటినీట నెచ్చెలులతోఁ గుమిగూడి
　　　జలకేళి సవరించు సరసమతివి!
అస్తాద్రిశిఖరిపై నంశుమంతుఁడు జేర
　　　పురుషోత్తముని గొల్చు పుణ్యవతివి!

అఖిలపురాణేతిహాసము ల్దిలకించి
పరమార్థనిధిఁ గొన్న భాగ్యవతివి,
దాసదాసీజనాకీర్ణ భాసమాన
రమ్యశుద్ధాంతమున వెల్గురాణి పగిది
మెలఁగుదానవు మిడియొండొ నలసి, సొలసి
యీదృశావస్థఁ బడ నేల? హేమగాత్రి!

చింతా—అయ్యా! కవుల కతిశయోక్తుల కేమిలోపము? పూర్వకాలమునుండియు నీయతిశయోక్తులే జాతీయగౌరవములకును, దేశభాషలకును ముప్పుగలిగించుచున్నయవి. మీ శిష్యురాలట్టిస్తోత్రపాత్రురాలు గాదు. గురుజనవిధేయ- అదియునుంగాక, సకలవిద్యాకళాచక్రవర్తు లగు మీరేమి? నా యింటి కరుదెంచు టేమి? ఎందులకు నన్ను జిన్నబుచ్చెదరు? నేను ఘోరపాతకములం జేసికొని యీ గణికాకులంబునఁ బడి యిహపరలోకవిదూర నై, నిర్గంధకుసుమము వలె జీవించుచుంటిని. (కన్నీరు విడచుచు) అయ్యా! గురూత్తమా! న న్నేందులకు బాధించెదరు? క్షమింపుఁడు. మాటాడుటకు శక్తి చాలకున్నది. పెనుభూత మావహించినపగిది మేను వణఁకుచున్నది. మనసున నెన్నియో తలంపు లుదయించుచున్నవి. ఎన్నియో భావము లంకురించుచున్నవి. ఎన్నియో కోర్కె లున్నవి. ఏమి లాభము! ఏమి యుపయోగము! అన్నియుఁ దనువుతో దగ్ధము కావలసినవియే కాని, యనుభవమునన దీ ప్రాణికి లేదు. అయ్యో! ప్రేమసాగరమా! పూర్ణచంద్రుని జూచి పొంగుచుంటివా? వలదు—వలదు— దుఃఖసాగరమున బడిపొమ్ము. హా! హా! (శయ్యపై నొరఁగును.)

బిల్వ—ఔరా! మోహనాంగీ! చూడఁజూడ నాకు గంగవెఱ్ఱులెత్తుచున్న వేమి? నే నెందుంటిని? కలయా? కల్లయా? బిల్వమంగళుఁ డనఁగ నేనా, కానా? ఇది చింతామణియేనా? నా వాంఛితార్థము లొసంగుచింతామణియేనా? (శయ్యదగ్గరకుఁ బోయి) చింతామణీ! ఏమ్మికితంబున నిట్లు సోలియుంటివి? అక్రమము— అవాచ్యము—దుర్భరము—హా! కులగౌరవములారా! ఆర్యమతధర్మములారా! విద్యావివేకమా! పరమేశ్వరపూజాఫలమా! పొండు-తొలఁగి పొండు- ఈబిల్వమంగళునకుఁ జింతామణి లభించినది. ఇఁక మీ ప్రసక్తి లేదు-నన్ను విడచి పొండు. చింతామణీ! నాకు దేవేరివి గమ్ము; కనులు విచ్చి చూడుము. పెన్నిధిం గాలదన్నిన పేదను నన్ను గటాక్షింపుము. ఏమి యీ యుదాసీనము! లెమ్ము.

(తెరలో) అమ్మాయీ!

బిల్వ—ఆహా! ఈ వచ్చునది చింతామణి తల్లి కాఁబోలును! అకటా! దైవసంకల్పము!

గీ. పీటిబాటను బడియున్న కోటిధనము
నోటిచెంతకువచ్చిన మేటిఫలము
కోటలనుదాఁటఁ బల్కెడు మాటయీవి
యనుభవించెడునందాఁక మనవి గావు.

ధనరాజు—(ప్రవేశించి) ఓహో! పంతులుగారువలె నున్నారు. అయ్యా! నమస్కారము. ఎన్నఁడును లేని దిట్లు దారితప్పి వచ్చినారేమి? ఇంతకాలమునకు మాయందు దయ గలిగినది కాఁబోలు! అమ్మాయి నిద్ర పోవుచున్నదా? అయ్యో! అమ్మాయీ! నేఁ డెవరో మనయింటికి క్రొత్తవారు వచ్చినారు; లేచి చూడవే! అయ్యా! ఇటు దయచేయుఁడు.

బిల్వ—చింతామణికి శిరోభారముగ నున్నదని చెప్పినది. కావున నిద్రాభంగము గలుగఁజేయకుము.

చింతా—అమ్మాయి మిమ్ములను జూచినదా?

బిల్వ—చూచినది. కాని, యొక్కింతసేపు నిద్రించి లేచినగాని మాటాడఁజాల నని చెప్పినది. జ్వరము వచ్చిన దేమో చూడుము.

ధన—జ్వరమే బాబూ! ఒక సంవత్సరమునుండి పీల్చుకొని తినుచున్నది. పాలిజ్వరమో-భూతజ్వరమో! తాపజ్వరమో-మదనజ్వరమో! ముక్కు మూలము తెలియుట లేదు. రాత్రులు సరిగ నిద్రింపదు గదా! నిద్రించిన బలవింతలు గదా! పలవించిన మీ నామస్మరణమే గదా; ఎందఱో సరసులు పడిగాపులు పడియున్నారు; ఎందఱో ధనవంతులు గులాములై యున్నారు. ఏమిలాభము! దాని చదువేమో, దాని పూజలేమో, దాని గురువులేమో, అంతియే కాని, యొకమేళము లేదు; తాళము లేదు; ఈలాగైనఁ గులవృత్తి సాగుటెట్లు బాబూ!

బిల్వ—అబ్బ! మాటలు తొణఁకు బెణఁకు లేకుండఁ జిత్తజల్లులవలెఁ జల్లినవై చితివి కదా! ఎందుకీయుపన్యాసము?

ధన—ఏమున్నది బాబూ! మేము భోగకాంతలము-మాకుఁ బడుపువృత్తియే జీవనాధారము-మీ శిష్యురాలి నించుక మందలింపుఁడని మిమ్ము ప్రార్థించుచుంటిని. మీ మాట త్రోసివేయఁజాలదు దాని బ్రతుకు మీ చేతిలో నున్నది.

బిల్వ—(తనలో) ఆహా! ఎంత గూఢముగ సంభాషించుచున్నది! కథకుఁ గాళ్లులేనట్లు మానవప్రకృతి కొక మార్గము లేదు. సళ్వమంగళా స్నేహమే శాశ్వత సాయుజ్యపదమనుకొనుచుండఁగ, నింతలో నీ చింతామణీరాగవల్లరి నన్నేల బంధింపవలయును! ఔరా! దైవచిత్రము! (ప్రకాశము) రూపాజీవా! నీ పేరెవరు?

ధన—ఇప్పుడు నా యూరుపేరు లేమున్నవి బాబూ! చిట్టిపాప పేరు చెప్పునరికి చెంగావిమడతలఖాండసుఁడైనను జెఱకువిల్తునికి జోహారు చేసి చిట్టిపాపకు దాసుఁడు కావలసినదే.



బిల్వ—(నవ్వి) నీవు చిట్టిపాపవా? బాగు బాగు! వయోవృద్ధుఁనకు బాలకవిబిరుదమువలె, నీకు వయసు షష్టిపూర్తియైనను జిట్టిపేరే నిలిచియున్నదా?

ధన—నాకు షష్టిపూర్తి చేయించువా రెవ్వరు బాబూ! మహారాజాశ్రితులములా? మాణిక్యహారములా? అందఱు నరసులే. తుద కేమి లేకపోయినను ధనరాజని పెద్దపేరుమాత్రమే మిగిలినది. ఏమియుపయోగము! కూడును గుడ్డయు నిచ్చి పోషించునా?

చింతా—ఆహా! బిల్వమంగళా! ఎంత నిర్దయుఁడవు! (పలవించి లేచును.)

ధన—ఓహో! దీనికి మెలకువ వచ్చినది. ఇఁక నే నిందున్న దిట్టిపోయును. మెల్లగ నావలకు జారుటయే మంచిది.

[నిష్క్రమించును.]

చింతా—[బిల్వమంగళుని జూచి సిగ్గు నటించును.]

బిల్వ—(తనలో) ఇదే నా మనోరథము ప్రకటించుసమయము. (ప్రకా) చింతామణీ! అట్లు భయభ్రాంత వైతివేమి?

చ. వదనము జెమ్మగిల్లెఁ; గచబంధము జిందరవందరయ్యెఁ దుర్
గవలెడు నోష్ఠము; ల్గనుల కాటుక చెక్కిళులంటజాఱె, బీ
తొదవినమాడ్కి శయ్య డిగి యూర్చుచు, సిగ్గునఁ జాటుమాటు డా
గెద వది యేమిహేతు? వెఱిఁగింపుము సర్వము నాకు నియ్యెడన్.

చింతా—అయ్యో! మీ రార్తురా తీర్తురా? ఎందుకీ కంఠశోషణము! నా పురాకృతమున కెవ రేమి చేయుదురు?

బిల్వ—సాధ్యాసాధ్యములు తరువాత నాలోచింపఁదగినవిషయములు. కావున, వినిపించినఁ దప్పేమున్నది? నష్టమేమున్నది?

చింతా—నష్టము లేకున్నను గష్టములలో మహత్కష్టము సంభవించు ననుభీతి జనించుచున్నది. మీ రభయహస్త మిచ్చిన యెడల నిర్భయముగ మనవిసేతును.

బిల్వ—అభయ మిచ్చితిని చెప్పుము.

చింతా—అబ్బా! ఏమి గడుసువారండి? మీ రెంతసర్వజ్ఞులైనను, నే నెంత యోఁడుదాననైనను మీయొద్దఁజదువుకొనుచున్న నేను మీ యుక్తి నే గ్రహింపలేకుందునా? మి మ్మభయహస్తమిమ్మంటిని గాని, యభయవాక్కు గాదు

బిల్వ—(తనలో) ఆహా!

చ. పొలఁతికరంబుబట్ట మది పొంగుచు నుత్సటలూఁగునంతఁ
బ్రాఁబలుకులయర్థ మన్యకులపాలిక నంటకఁటంచు వేవిధం
బులఁ జెవి నిల్లు గట్టుకొని పోరుచునుండె; నిఁ కేమిసేతు నీ
కలికి విలాసము ల్గనిఁ గంతుఁడు నైన మదిం భ్రమింపఁడే?

చింతా—ఆర్యపుత్రా!

గీ. పళ్లెరంబున బెట్టిన పనసపండు
ననుభవింపక దిక్కుల నరయుటేల?
కోరి, తనయంతఁ దా వచ్చు కోమలాంగిఁ
గాలఁ దన్నునె? మిమువంటి ఘనులు భువిని.

ఆలసింపకుఁడు. స్త్రీహత్యాపాతకమున కొడిఁ గట్టకుఁడు. ఆర్తనై వేఁడుచుంటిని. నిలువఁజాల—భరింపఁజాల—మోహామా! ఎందేని పోయి బ్రతుకుము. ఇహసౌఖ్యములారా! పొండ; నన్ను విడిచి బిల్వమంగళమూర్తికడకుఁ బొండు—దేహమా! హవ్యవాహనున కాహుతి యగుము. సకలానందసౌఖ్యస్వరూపా! నమస్కారము—ఈతుబలము దలంచికొనుచుండుము— (వెళ్ళఁబోవును.)



బిల్వ—(చింతామణి చేయి పట్టుకొని) సుందరీ! ఏమిటికీసాహసము! వలదువలదు. సాహసింపవలదు. ఈ బిల్వమంగళుని కంఠమున బ్రాణమున్నంతవఱకు నీ కెట్టిభయమును గలుగనేరదని నమ్ముము. ఇదె! నాయభయహస్తము గ్రహింపుము.

చింతా—ఆహా! దయామయా!

ఉ. కరముం గ్రహించి యైహికసుఖంబులఁ గూర్చుమదీయభర్తలై
పరఁగితి రింక మీఁద నను బాలను ముంచిన నీట ముంచినన్
భర మది మీ పయిం గలదు, పండితసత్తమ! పెక్కులేల? మీ
చరణముల న్భజించి పరిచర్య లొనర్తును ధర్మపత్నినై.

బిల్వ—హృదయేశ్వరీ! రోగియుఁ బాలు గోరె; వైద్యుఁడును బాలిమ్మనియె. కావున, నేఁటికి మన మనోరథంబులు ఫలియించినవి. ఇదే శుభసమయము గావున, నా తొలిముద్దు నిమ్ము.

[ముద్దిడును.]

చింతా—మనోహరా! నా కిప్పు డింకొకవర మనుగ్రహింప వలయును.

గీ. అగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టిసతిని
దైవసాక్షిగఁ జేకొన్న తరుణి నన్ను
నొక్కపోలికఁ బ్రేమించి యుక్తరీతి
నేలికొనఁదగు శ్రీకృష్ణలీలఁ బూని.

బిల్వ—ఓహో! బుద్ధిరుతికా! నీ దృష్టి మిగుల దూరమా రయుచున్నది. కాని, కర్మతంత్రి యెట్లు నడిపించునో నే నిప్పు డేమి చెప్పఁగలుగుదును. ఇందులకు నిదర్శనము మనపరస్పరసంయోగమే!

ఇట్లు జరుగునని యిదివఱ కెన్నఁడైన మన మెఱుఁగుదుమా? సర్వమునకును జగన్నాటకసూత్రధారుం డగుభగవంతుఁడే కలఁడు. నా త్రికరణశుద్ధిగ నీ యిచ్చచొప్పుననే ప్రవర్తింప వలయునని యున్నది. దైవసంకల్ప మెట్లున్నదో!

చింతా—ఇఁకరండు; పూఁదోఁటకు విహరింపఁబోవుదము.

[ఒకరిభుజముపై నొకరు చేతులు వైచుకొని వెడలుదురు.]

---

శ్రీరామ

# శ్రీకృష్ణలీలాశుకము.

## చతుర్థాంకము.

### మొదటిరంగము.

---

(కేశవుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కేశ—ఔరా! కాలమహిమ! మహాకవి యెంతలో మాయావిమోహితుం డయ్యెను! పండువంటిసంసారము భగ్నము చేసికొని చింతామణియింటనే కాలము గడపుచుండెఁగదా! ఎంతటివిద్యావంతుఁడైననేమి? ఎంతటిగుణవంతుఁడైననేమి? ఎంతటి యైశ్వర్యవంతుఁడైననేమి? తుద కొక తొత్తు మాయలలోఁ జిక్కి సర్వమును మఱచినాఁడు! ఎవ రేమి చెప్పఁగలరు? ఏమి మాటాడఁగలరు? ఎట్టిపండితుఁడునుగూడ నాతనియొద్దఁ జేతులు జోడింపవలసినదే గాని, యెదిరి మాటాడఁగల్గువాఁ డొక్కఁడును లేఁడు. వాక్యార్థమునకుఁ దలపడినచో నెదుటివానినో రెత్తనీయకుండఁ జేయఁగలసమర్థుఁడు. ఇట్టిమహనీయుఁ డెంత యవివేకి యయ్యెను! ఆహా! దత్తపుత్రులలో నుత్తమగుణుఁడును, దాయాదులలో న్యాయ్యబుద్ధియు, పునర్వివాహితులలోఁ బూర్వాత్మజప్రేమగలవాఁడు నుండు టరుదుగదా! పాఠశాలం బహిష్కరించి, విద్యార్థుల నందఱను వెడలఁగొట్టె. నేనును, నారాయణశర్మయును మాత్ర మింకను త్రిశంకునివలె వ్రేలాడుచుంటిమి. కాని, చదివిన నీతనియొద్దనే చదువవలయును. లేకున్న చదువుమానవలసినదే. ఇట్టి బోధకుఁడు ప్రపంచమున నెందును గలుగఁబోఁడు. ఆ

మహనీయుని బోధనాశక్తి యెట్టిదో కాని, మరల చింతనసేయ నవసర ముండదు గదా! అయ్యో! మాసమున కొక్క పాఠమైనను లేక నిత్యానధ్యయన మైపోయినదే! ఇం కేమి సేతును?

[నారాయణశర్మ ప్రవేశించును]

నారా—ఏమోయి! కేశవా! ఎక్కడకు బయలుదేరితివి?

కేశ—సర్వమంగళమ్మగారు మన గురువుగారిని *కాశీనుండి యుత్తరము వచ్చినదని చెప్పి వెంటఁ దోడ్కొనిరమ్మని సెలవిచ్చినారు. అందుచేఁ జింతామణీభవనమున కేగుచుంటిని. కాని, నీ వెం దేగి వచ్చుచుంటివి?

నారా—ఉపాధ్యాయులు తమ జనకగృహమున కేగి క్షేమసమాచారము దెలిసికొనిరమ్మని యాజ్ఞాపించిరి. అందుచే ప్రభాతముననే బయలుదేరి పోయి వచ్చుచుంటిని.

కేశ—అందఱు క్షేమముగ నున్నారా?

నారా—ఏమి క్షేమము! సర్వశూన్యమై, సన్న్యాసిమఠమువలె నున్నది. చెప్పిన నోఘాయిత్య మందువేమో గాని, స్మశానమనియే చెప్పవచ్చును.

కేశ—అయ్యయ్యో! అదే మట్లనుచుంటివి?

నారా—మానవసృష్టిలో నెన్ని చిత్రకథలైనఁ గలవు. బిల్వమంగలోపాధ్యాయుని జనకునకుఁ దృతీయవివాహమఁట. ద్వితీయభార్యకు మన గురువులును, నింకొక బాలికయు జన్మించిరఁట. ప్రథమభార్యకు సంతతియే లేదఁట! ఇట్లుండఁ గొంతకాలమునకు గురుపాదుని సపత్నీమాత, గోపాలశర్మ యనునాతనిపై దుర్మోహాసక్తయై, సపత్నీపుత్రినిఁ దనవిటకానిచేఁ జంపించెనఁట! ఆనాఁటి



రాత్రియే వారిగృహముగూడ పరశురామ ప్రీతియై యింటనున్న వా రెల్లరుఁ జచ్చిరఁట!

కేశ—ఇది యంతయు నీ కెట్లు తెలిసినది?

నారా—ఇరుగుపొరుగువారివలనఁ దెలిసికొంటిని. మనగురువులకుఁ బూర్వనామధేయము సుందరుఁడనికూడ చెప్పిరి ఈతనిబాల్యచరిత్రను జెప్పఁగంట తడిపెట్టని స్త్రీ గాని, పురుషుఁడు గాని లేరు.

కేశ— నీవు చెప్పినదంతయును సరియేగాని, యొక్క యసందర్భము గనఁబడుచున్నది. ఏమందువా? బిల్వమంగళునిబాల్యచారిత్రమును జెప్పుచుంటివి. అందుపై నాతనిని జంపించె నని చెప్పుచుంటివి. ఆతఁ డీతఁడు కాఁడా?

నారా—ఆతఁ డీతఁడని మన మిప్పు డెఱుంగుదుముగాని, యిదివఱకుఁ దెలిసినదా? అట్లే యాగ్రామవాసులుగూడ నీతఁడు వధింపఁబడెననియే భావించుచున్నారు.

కేశ—ఇల్లు దగ్ధమగుటకుఁ గారణమేమి?

నారా—ఎవ్వఁడో మాలఁ డీఘోరకృత్యముం జూచియోర్వఁజాలక యట్లు చేసియుండె నని కింవదంతికలదు.

కేశ—పాప మాయింట నెవ్వ రెవ్వ రుండిరో!

నారా—తండ్రి - సవతితల్లి - సవతితల్లితల్లి - వీరుమువ్వురును మడిసిరఁట. సోదరేమైనదో మాత్ర మెవ్వరికిని దెలియదు.

కేశ—అన్నన్నా! ఈ మార్మనుములు మూలకముగ బ్రాహ్మజాతి యెంత నీచమైపోయినది! దీని కంతకును గన్యావరశుల్కవివాహములే కారణము. ఈ దినములలోఁ బొలముపంట పొల్లుపంట యైనను. గడుపుపంట కాసులపంటయే.

నారా—తుదకు మనము పరమానందయ్యగారి శిష్యులవలె నిక్కడనే ప్రొద్దుపుచ్చున ట్లున్నాము.

కేశ—అవును నిజమే. పరశురామప్రీతివృత్తాంతమును పాటలోఁ జెప్పినశిష్యునివలె నీవును, చావుకబురు చల్లగాఁ జెప్పినశిష్యుఁడను నేనును, నిప్పు డట్టివారమే యైతిమి.

నారా—చావుకబు రేమి?

కేశ—కాశీలో దామోదరపండితులు మరణించి రనుకొందును. సర్వమంగళమ్మగారి ముఖలక్షణములు జూడ, నా కట్లు కనఁబట్టినవి.

నారా—అట్లయిన త్వరపడుము.

(నిష్క్రమింతురు.)

---

రెండవ రంగము—రాజవీథి.

---

(గోపాలశర్మ ప్రవేశించును)

గోపా—(విచారముతో) అన్నా! తుద కెట్టిదుర్గతి సంభవించినది!

చ. వడఁకుచునుండె మేను; తలవంపు ఘటిల్లెను బంధుకోటికి; నె
వ్వడువున గర్భశోకమునఁబొల్పడుపత్నిని నూరడింతు; హా!
కడుపునఁ జిచ్చు వెట్టి కొడుకా! దివి కేగితొ దిక్కుమాలి, యీ
చెడుగున కేల పుట్టితివి! చిన్నికుమార! వివేకరత్నమా!



అక్కటకటా! భవానీమోహపాశబద్ధుండనై, పుణ్యపాపవిచక్షణము లేక పవిత్రచరిత్రుం డగుసుందరసుకుమారుని వధింపసమకట్టిన నా కెట్టియిక్కట్టు సంభవింపకుండునా? ధర్మస్వరూపుం డగుదైవంబు జగత్సాక్షియై సర్వంబునుజూచుచుండ లేదా! పాపమే నాఁటికైనను బ్రద్దలు కాక మానదు. ఏ కర్త మెఱుంగనిసుందరు నెందులకుఁ జంపింప సమకట్టవలయు? తత్పాపఫలమే యీగర్భశోకరూపమునఁ బరిణమించి యనుభవింపఁ జేయుచున్నది. అయ్యో! నీ కెంతలో నూరేండ్లు నిండెరా తండ్రీ! నీ ప్రాణమున కీ యకాలమృత్యు వెందుండి వచ్చినది? భవానిచేఁ బ్రయోగించినచురియ నీకు మృత్యుస్వరూపమై, సుందరునకుఁ జిరాయుర్భాగ్యదమైనదా! ఔరా! వెంకడూ! ఈ చావుకబురు నాఁడే చెప్పక, చల్లఁగ నేఁ డెందులకుఁ జెప్పితివిరా? ఆఁ! చెప్పకుండు టెట్లు! చేసినతప్పు చెప్పకొన్నఁ బోవును గదా! మంచిపనిచేసితివి. సుందరుని వధింపఁ బ్రోత్సహించిననాకుఁ గడుపుశోకము సమకూర్చితివి- ఈ యంతర్నాటకకథానాయిక యగుభవానికిని, దన్మాతకును, మూఁడవపెండ్లముతో ముడియఁదలఁచినవాసుదేవమూర్తికిని, పాపపరిహారార్థముగఁ గొంపపైఁ గొఱవిపెట్టి మృత్యుదేవతామందిరమునకుఁ ద్రోవ జూపితివి- కాని, తుద కీపాపమంతయు నా నెత్తిని బడి యనుభవింపనే మిగిలియుంటిని. అయ్యో! ఎంత పాపాత్ముఁడను!

[తెరలో] గోవిందరాంరాం—గోపాలరాంరాం—

గోపా—(ఆలకించి) ఓహో! ఎవ్వఁడో భక్తునివలె నున్నాఁ డీతఁ డెవ్వఁడో! సుబ్బిశెట్టి కంఠమువలె మారుమ్రోగుచున్నదే (ముందుజూచి) ఆహా! ఆ యొడలునిండినయూర్ధ్వపుండ్రములు, ఆ పట్టుపీతాంబరపువల్లెవాటు— ఆ కుఱ్ఱకుంకల కోతిచేష్టలు - ఇదేమో వింతగ నున్నదే!

(సుబ్బిశెట్టి కొందఱుబాలురతోఁ బ్రవేశించును.)

సుబ్బి——(బాలురకు పంచదార పంచిపెట్టుచు) గోవిందరాం రాం—గోపాలరాంరాం-(అనుమంత్రిమును పఠించును)

గోపా——(తనలో) ఓహో! ఈతఁడు సుబ్బిసెట్టియే. ఇంత భక్తుఁ డెప్పుడయ్యెను చెపుమా!

సుబ్బి——ఏమయ్యా! గోపాలశర్మా! కన్నుకదపకుండఁగఁ జూచుచున్నావేమి? చేతబడిమంత్రాలు నేర్వ లేదుగదా!

గోపా——సెట్టి కిట్టి భక్తి యెందుండివచ్చిన దని యాలోచించుచున్నాను.

సుబ్బి——అయ్యో వెఱ్ఱివాఁడా! సానిసంపర్క మున్నంతవఱకె సంబరాలుగాని, సర్వాంగక్షౌరమైనప్పుడు సన్యాసివేషముకన్న జీవనాధార మేమున్నది?

గోపా—ఏ మట్లనుచుంటివి? చింతామణికిని నీకును జెడిపోయినదా యేమి?

సుబ్బి——అదివఱ కున్న దేమి; ఇప్పుడు క్రొత్తగఁ జెడిపోయిన దేమి? నీకు మాత్రము దెలియదా?

గోపా——తెలియ కేమి? తెలిసినది కనుకనే ప్రాణముతో నీవలఁ బడితిని. లేకున్న, నీసరికి బిల్వమంగళుఁడు తనపాట్టనే బెట్టికొని యుండును.

సుబ్బి——నిన్నొంతపని యైనఁ జేయవలసిన దే. లేకున్న, పాన కములోనిపుల్లనలె నా బిల్వమంగళు నెందుకుఁదెచ్చి పెట్టితివి? పోనిమ్ము; దానికేమిగాని, నేను గురువునని గునిసేవాఁడవుగదా, నీతో నెన్నఁడైనఁ నొక్క మాటయైన నాడినదా?



గోపా——ఇప్పు డవి యన్నియు నెందులకు? ఏమియును లాభము లేదు. కాని, చింతామణిమాత్ర మగ్రజాతిని బుట్టవలసినది కాని, భోగకులమునఁ బుట్టవలసినది కాదు సుమా!

సుబ్బి——నిజమే. దాని భక్తి – దాని పూజలు—దాని వ్రతములు- చూచిన నెట్టిశృంగారపురుషుఁడైనను, నిద్రియనిగ్రహుఁడు కావలసిన దే. ఇం తెందులకు? మన మెంతకాలమైనను, ధనరాజుతో డనే సరసమాడితిమి గాని, చింతామణి నెన్నఁడైనఁ గన్నెత్తి చూడఁగలిగితిమా?

గోపా——అయితే, నీ విప్పు డెక్కడకు బయలుదేరితివి? ఇఁక ముందు చేయఁబోవు వ్యాపార మేమి?

సుబ్బి——అబ్బో! నీ టక్కరి నాకుఁ దెలియును. నే నేమిచేయుదునో, నా గుట్టు మట్టు దెలిసికొని నాకుఁ బోటీ వచ్చుటకా? (తలయూపి) చాలు! పద పద!

గోపా——నీ భార్యపేర నేదో కొంత యాస్తి వ్రాసి జాగ్రతపడితివి కాఁబోలు!

సుబ్బి——మా కులాచార మదియే గాని, నేను మాత్ర మట్లు చేయ లేదు. ఎందుచేత ననఁగా:- వెనుక నొకనాఁ డా ముసిలితొత్తు నాకుఁ జింతామణిం జూపి యొకమాటలో భ్రమపెట్టి నా యావదాస్తియును వ్రాసి యిమ్మన్నది. నేను కాఁబోలునని సర్వస్వమును వ్రాసి యిచ్చితిని. ఇప్పుడు గంతులువైచిన లాభ మేమి? సిరిసంపదలన్నియును బోఁగొట్టుకొని తుదకు సెట్టిని మిగిలియుంటిని. పువ్వులమ్మిన చోటనే కట్టెలమ్మినట్లు పొట్టకొఱకీ వ్యాపారము చేయుచుంటిని.

గోపా— -ఏమివ్యాపారము?

సుబ్బి—గ్రహబాధలున్న వారికి రక్షరేకులు కట్టుచుందును.

గోపా—కోమటిరహస్యమిదియే కాఁబోలు!

సుబ్బి—నాకు నీ రహస్యము గూడ తెలియును.

గోపా—ఏ మది?

సుబ్బి—బాపనిరహస్యము "భవతి! భిక్షాం దేహి" యని--నీ వింక ముందు చేయఁబోవునుద్యోగ మదియే కదా!

గోపా—నీ కోమటియుక్తుల కేమి గాని, మన మిప్పు డొక పని చేయవలయును.

సుబ్బి—వడ్డీ కిట్టునా లేదా? ముం దా మాట చెప్పుము. ఈ రోజులలో వడ్డికట్టని వ్యాపారము గుడ్డిగవ్వకైనను మారదు.

గోపా—పోనిమ్ము! దాని కేమిగాని, యింతవఱకు వచ్చినప్పు డింక బిల్వమంగళుని పై నెట్లయిన మన కసి దీర్చికొన కూరకుండరాదు.

సుబ్బి—చాలుఁజాలు! మంచి యాలోచన చేసితివి! ఇంక నీ బ్రదుకు బుఱ్ఱలు గొట్టుటయు, కొంపలు దోచుటయునా? బ్రాహ్మణుఁడవు కాఁబట్టి నీ వన్నిఁటికిని సమర్థుఁడవు. తలలు మార్చఁగలవు-తగవులు దిద్దఁగలవు తంత్రములు పెట్టఁగలవు-తత్త్వములు పాడఁగలవు; సంజకవళ మెత్త గలవు-సవారి యెక్కఁగలవు; భోగాలకొంపలు దూరఁగలవు-యాగాదికర్మలు చేయఁగలవు; వితంతువివాహము జేయఁగలవు-వేదప్రమాణము జూపింపఁగలవు.

గోపా—అబ్బా! ఎందు కీ దండకము?

సుబ్బి—ఎందులకా? నేను నీతోఁ జేరకుండ, రక్షరేకు లమ్ము కొనియైన బ్రదుకుటకు—ఇప్పటికైన నీకు బుద్ధివచ్చుటకు—తెలిసినదా?

గోపా—ఆ! తెలిసినది. ఇఁక మనప్రతిష్ఠ వీధినిబెట్టక నీ దారిని నీవు పొమ్ము! నాదారిని నేను బోయెదను. అన్నియు నుడిగిన వెనుక నర్ధాంగియే మనకు గతి.

సుబ్బి—గోవిందరాంరాం - గోపాలరాంరాం—

[ఇరువురు నిష్క్రమింతురు.]

---



## మూడవరంగము — చింతామణిగృహము.

—:o:—

[చింతామణి, ధనరాజు ప్రవేశింతురు.]

ధన—అమ్మాయీ! పంతులుగారు చనువిచ్చినారు కదా యని యిట్లెదిరించి మాటాడవచ్చు నఁటే!

చింతా—నే నెదిరించిన దేమున్నది? పితృకర్మ జేసికొనుమనుట తప్పా?

ధన—మన యిండ్లకు వచ్చువారి కీ కర్మలు, కారుణ్యములు నామమాత్రావశిష్టములే గాని, యాచరణార్హములు గావు. వారికి ద్యూతము, ధూమపానము, మద్యపానము, దొంగతనము మొదలగు నవియే నిత్యానుష్ఠానములు—నిత్యకర్మలును-

చింతా—అమ్మా! ఏండ్లు వచ్చుచున్నకొలఁదియును నీ బుద్ధి యింత బుగ్గియై పోవుచున్న దేమీ? ఎన్నిమారులు వలదని చెప్పినను నీ నోటివెంట నవాచ్యములే బయలువెడలును గదా! పుణ్యమా, పురుషార్థమా?

గీ. మాటలాడిన శ్రీకృష్ణమంత్రపదము
వినఁదలంచిన కంసమర్దనుని సుద్ది
భక్తిఁగొల్చిన వేణుగోపాలమూర్తి
నింతకంటెను బరమార్థ మెద్ది నీకు.

కావున, నింకనైన నా మాట విని యస్థిరంబు లగునిహభోగంబులం దవులక, పరోక్షజ్ఞానసంపాదనమునకై ప్రయత్నింపుము- నమ్మిన నొక్క దైవమునే నమ్మవలయును-నేర్చిన నొక్క విద్యనే నేర్వవలయును- చేపట్టిన నొక్క పురుషునే చేపట్టవలయు- మనోనిగ్రహమున కిదియే మహత్సాధనము- ముక్తిమార్గమున కిదియే మూల

సూత్రము- అమరలోకభోగానందసంధాయకమున కిదియే యమృత కలశము. అమ్మా! కాలము వృథసేయక యే మహానుభావునియొద్దనైన శుశ్రూషఁ జేసి జ్ఞానమును బడయుము.

ధన — అమ్మాయీ! ఇదేమే! నే నెందుంటినే? ఈజగ మంతయు నలముకొనుచున్న యీ దివ్యతేజ మేమి? ఆహా! ఏమి యీ యపూర్వ జ్యోతి! ఓమహానుభావా! ద్రౌపదీమానసంరక్షకా! గజేంద్రాభయ వరదా! నీదివ్యమూర్తిని సాక్షాత్కరింపఁజేయుము. నేను కడు పాపాత్మురాలను. రక్షింపుము.

[యోగమాయచే సోమగిరియోగి ప్రవేశించును]

సోమ — చింతామణీ! నేఁటికి నీ కర్మ పరిపక్వమై ధన్యవైతివి. నీవు ధాత్రినే గాక, నరకకూపమున బడియున్న గణికాకులము నంతను దరింపచేసితివి. నీకు పరమపద మలవడుఁగాక!

ధన — (నివ్వెఱపడి చూచును.)

చింతా — (నమస్కరించి) అయ్యా! తాపసోత్తమా! కవాటములు బంధించియుండఁగ, మీ రీగృహములోని కెట్లు రాఁగలిగితిరి? మీ నామధేయ మేమి?

సోమ — వత్సే! నేను సోమగిరియోగిని. మాకు దుర్గమంబగుతా వెందును గలుగఁబోదు. యోగమాయచే నభోమార్గమున వచ్చియుంటిమి. కాని, నే నిప్పు డరుదెంచినపని విందువా?

చింతా — మహాప్రసాదము.

సోమ — తొలుత నీవొక బ్రాహ్మణ వితంతుగర్భమునజన్మించి యతి గోప్యముగఁ బెరుగుచుండఁ గ్రమక్రమముగ నీ జన్మవృత్తాంత మానోట నా నోట లోకమున వెల్లడియైనది. అప్పుడీ జనశ్రుతిని భరింపఁజాలక యొకనాఁటి యర్ధరాత్రమున నిన్నొక పేటికం బెట్టి



కొని నాగావళీనదీజలంబుల నా పేటికం బాఱవైచు తలంపున నిల్లు బయలుదేఱి పోవుచుండిరి. కొంత దూర మేగునప్పటి కా పురుషుఁడు మీ జనని నడువలేకుండుట గ్రహించి త్రోవనంటియున్న పుష్పోద్యానముం బ్రవేశించి లోకాభిరామాయణము జెప్పుకొనుచుండిరి. అంతలో నారామభవనమున నీధాత్రితో విహరింపవచ్చిన విటునకు మెలకువవచ్చి దొంగలని సంశయించి యొక్క కేక వైచెను. ఆ కేక వినినంతనే యా స్త్రీపురుషులు పెట్టె నట దిగవిడచి సత్తువకొలఁదియుఁ బఱుగెత్తి పోయిరి. పిదప —

చింతా — అయ్యా! తరువాతివృత్తాంతము మా జననివలన వినియుంటిని.

ధన — మహర్షిచంద్రమా! మీ రాకచే నా గృహము పవిత్రమై, జన్మము ధన్యమైనది. ఈ బంగారుతల్లి నాకు పుత్రికయగుటచే గణికాకులము ఘనతకెక్కె, నా సద్గతికిఁ జేయూఁతయైనది. నేఁటికి మీ దయవలన నా సందేహము దీరినది.

చింతా — అయ్యా! మజ్జనని యెందు బోయినది? నాకు ముందు గతి యేమి?

సోమ — నీ జనని మాయాశ్రమంబునఁ గన్నబిడ్డవలెఁ బెరుఁగుచున్నయది. నీవు ప్రారబ్ధవశమున వితంతుగర్భసంజనితవై వారకులమునఁ బడితివి. నీ కెట్టి దుర్వృత్తులు నంటకుండుటకై శ్రీకృష్ణమంత్ర ముపదేశించియుంటిని. కావున, నీ వేకర్మమును నెఱుఁగవు. ఇంక కొలఁది దినములలో సంసారానుబంధము వీడి విరాగిణి వయ్యెదవు. అప్పు డెందును బోవక మదాశ్రమమునకే రమ్ము.

ధన — అయ్యా! ఇంకొక్కసందియము కలదు. మీరు సెలవిచ్చిన పురుషుఁ డెవ్వఁడు? ఏ కులమువాఁడు?

సోమ— ఇదియును సందేహమేనా? వెక్కుకొంపలను మాపిన కొఱవి యగు నీ సరసుఁడే యీ పురుషుఁడు.

ధన—(కోపముతో) ఆఁ! ఏమీ! గోపాలశర్మయేనా? చీ! చీ! పాపాత్మా! ఇదిగో! నీ పాపఫల మనుభవింపఁజేయ ని పాలిటి మృత్యుదేవత వచ్చుచున్నది; కాచికొనుము.

[నిష్క్రమించును.]

చింతా—మహాభాగా! ఏమి యీ విచిత్రనాటకము!

సోమ— దీని కేమి? బిల్వమంగళుని బాల్యవృత్తాంత మింతకంటెను జిత్రమైనది.

చింతా— వినఁ గుతూహలపడుచుంటిని.

సోమ—ఆతఁ డింతలో రాఁగలఁడేమో! కావున, మఱొక సమయమున జెప్పెదను లెమ్ము.

చింతా— నేఁడు వారితండ్రిగారి పితృదిన మగుటచే నింతట రారు.

సోమ— అయినను మాకు సమాధివేళ యైన దింక తడయు రాదు. నీవు మదాశ్రమంబునకరుదెంచినపిదప నెల్లసమాచారములు దెలిసికొందువు గాక! మఱొకరహస్యము కలదు వినుము పండితుం డగు బిల్వమంగళుఁడు తనపాపమునకుఁ బశ్చాత్తప్తుఁడయ్యేనేని, యాతనింగూడ మదాశ్రమమునకుఁ బంపుము.

చింతా— మహాప్రసాదము.

[ఇరువురు నిష్క్రమింతురు.]

---

# శ్రీకృష్ణలీలాశుకము.



## షష్ఠాంకము.

---

[బిల్వమంగళుని గృహము.]

[బిల్వమంగళుఁడు, సర్వమంగళ ప్రవేశము.]

బిల్వ—(రూక్షస్వరమున) కాంతా! నీ కింత పంత మేల?

సర్వ—(దోసిలొగ్గి) నాథా! పంతము గాదు— ప్రార్థనము. పితృకర్మాచరణదివసమున బ్రియుదార నంటుటయే దోషము—అందు వారకాంతాసంసర్గ మంతకంటెను బాపకృత్యము కదా! సకలశాస్త్రరహస్యవిదులగు మీకు నేఁ జెప్పవలయునా? నా ప్రార్థనమాలకించి, యీ రేయిమాత్ర మిందే కాలయాపనము చేయుఁడు.

బిల్వ— నా కన్నియును దెలియును. ఇఁక ని ధర్మోపన్యాసములు కట్టిపెట్టి యావలకుఁ బొమ్ము. వద్దనుటయును కద్దనుటయును నీవా నాకుఁ జెప్పునది? అస్వతంత్రయగు శుద్ధాంతకాంత సకలతంత్రస్వతంత్రుఁడగు పురుషునకు నీతి నుపదేశించుటయా? పంచమజాతివాఁడు బాపనికిఁ బంచాంగశ్రవణము సేయును గాఁబోలు. ఔరా! కాలమహిమ!

ఆ. వనిత రచ్చకెక్కి వాదులాడిన నింటఁ
బొయ్యి యూఁదవలయుఁ బురుషుఁ డిఁక
బ్రహ్మజాతి నీతిబాహ్యమై వర్తింప
వెలివాఁడు నవ్వఁడే, విద్య నేర్చి.

సర్వ—సకల విద్యాపారంగతు లగు మీకుఁ దెలియని ధర్మములు లేవు. అయినను, మీ స్వేచ్ఛాప్రవృత్తి కెన్నఁడైన భంగము గలుగఁ జేసితినా? మీ చరణదాస్య మున్నఁ జాలుననియే సంతసించితిగాని, యెన్నఁడైనఁ జింతామణి యింటికిఁ బోవలదని చెప్పితినా? నేఁడైన నూరకుందును. కాని, లోకులు కాకుల వంటివారలు. తండ్రిగారి కర్మ దగ్ధముసేసి చింతామణిం జేరఁ బోయె నని యువ్వెత్తుగఁ జెప్పికొందురు. ఆఁడుదానను గావున నిట్లు దేవులాడుచుంటిని.

బిల్వ—(కోపమున) ఓహో! ఇది యంతయుఁ జింతామణిపైఁ బ్రేమయే కాఁబోలు నేమి? ఈ కల్లబొల్లి పల్కు లెప్పుడు నేర్చితివి? చింతామణి యింటికిఁ బోవల దన కుండుటయు నొక సుగుణమేనా? అబ్బా! లేకున్న నన్నడ్డుపెట్టఁ గలవా? ఏదీ, చూతు నడ్డు పెట్టుము. (వెళ్ళఁబోవును.)

సర్వ—(పాదములఁబడి) నాథా! మీ చిత్తమున కన్యథా సేయుదానఁ గాను. ఈ యొక్కనాఁ డీ మూలముననైన నాకు నేత్రానంద మొనఁగూర్పుఁడు. నా మొఱాలకింపుఁడు. మీ కన్న నా ముద్దుముచ్చటలు దీర్చువా రెవ్వరు? నీలమేఘ మాకాశ మంతటను నలముకొని, పిడుగులఁ గురియుచున్నది. వర్షముతోఁ గూడిన ఝంఝానిలము మహాప్రళయము వలె వీచుచున్నది. నా మనవిఁ జిత్తగింపుఁడు.

బిల్వ—కాంతా! నా కడసారి మాట చెప్పుచుంటిని వినుము. నీవు పరమ పవిత్రవు- గురుజన విధేయవు- పతివ్రతాచరణదీక్షవు- నీయం దేదోషమును లేదు. నా పూర్వజన్మ సుకృతముననే నీవు నాకు భార్యవైతివి. కాని, నే నేమి చేయఁ గలుగుదును. కాలప్రవాహమునఁ బడి మోహసాగరమునకుఁ గొట్టుకొని పోయితిని. దరి



జేరుటయును, జేరక పోవుటయును నా యధీనమున లేదు. అంతయు దైవాధీనమే. ఇప్పుడు నేను గేవల మన్యకాంతాయత్త చిత్తుఁడనై, యస్వతంత్రుఁడ నై పోయితిని. నా యందలి మోహమును వీడుము. కఠిన హృదయుఁ డని తలంపకుము- చింతామణి యీ తుపానున కేమి భీతిల్లుచున్నదో! నన్నడ్డు పెట్టక పోనిమ్ము.

[కాళ్ళు విదలించి పాఱిపోవును.]

సర్వ—హా! నాథా! సకలానందసౌఖ్యసంధాయకా! పాఠశాలకుఁ బోయిన తఱిఁ జిత్తము నాయందుంచు మనియే చెప్పి యుండెడివారు గాదా? ఇప్పు డా ప్రేమ యెందు బోయె? ఆ పాఠశాల యేమయ్యె? ఆ విద్యార్థు లెందు బోయిరి? ఇప్పు డన్నియును జింతామణీగృహముననే యున్నవా? ఛీ! పాపాత్మురాలా! చింతామణీ! నా నాథున కేమిమందు బెట్టితివి? ఇట్లు భార్యాభర్తల నెడఁబాపి నీ వేమి బావుకొనియెదవు! పితృకర్మ జేసికొనుటకు నీ యాజ్ఞ కావలసి వచ్చెనా? నీ యుపదేశము వేదప్రమాణమైనదా? ఎంత మహాపండితుని తల కెంతలో విషమెక్కించితివి! అకటా! నాథా! ఏనాఁడు జ్యోతిష్కుఁడు మీ జాతకఫలముం జెప్పెనో, ఆ నాఁడే నా యీ దుర్దశ నూహించితిని. అయ్యో! సవతి వచ్చినచో సగము ప్రేమనే పంచికొనును గాని, యింత సర్వశూన్య మగునా! ఎవ్వరిని నిందించిన నేమి లాభము! నా లలాట లిఖిత మిట్లున్నది. చచ్చిన, సాధ్వీమార్గముననే బోవలయును. నాథుని కొఱ కెవ్వఁడో శత్రువు కాచి తిరుగుచున్నాఁడని వినియుంటిని. ఇదే సమయమని నాథుని ముట్టడింపఁడు గదా! హా! పోవలయు- పోయి కాపాడవలయు- పతి ప్రాణమునకు నా ప్రాణ మడ్డుపెట్టవలయు- ఇదే! పెరటి దారిని పోయి నాథునిఁ జేరుదును గాక! (నిష్క్రమించును.)

---

రెండవ రంగము—రాజవీధి.

---

(బిల్వమంగళుఁడు, సర్వమంగళ చెఱియొకప్రక్కనుండి ప్రవేశింతురు.)

సర్వ - దూరమున నెవ్వరో యీ వంకకే వచ్చుచున్నట్లు మెఱపుకాంతిచే దృగ్గోచర మైనది. కాని, సరిగ గుఱ్తు తెలియదయ్యె. (మెఱయును.) ఆహా! ఈ మెఱపుతో నాసందియమ్ము దీరినది. నాథుఁడే! మెల్లఁగ కౌఁగిటంబట్టి గృహమునకుఁ దీసికొని పోయెదఁగాక! (కౌఁగిలించి) నాథా! మిమ్మెడఁబాయఁజాలను. ఈయొక్కరాత్రియు నాకు నేత్రానందమొనఁగూర్పుఁడు.

బిల్వ— (మొల నున్నకైజారు తీసి) ఓరీ! నీచా! గోపాలశర్మా! అకారణంబుగ నన్ను వధింపఁదలఁచిన నీవే, నేఁడు నాచే వధింపఁబడుచుంటివి; కాచికొనుము. (సర్వమంగళను బొడుచును.)

(సర్వమంగళ నేల నొరగును; బిల్వమగళుఁడు నిష్క్రమించును.)

---

మూడవ రంగము— చింతామణి గృహము.

——————:)o(:——————

చింతామణి ప్రవేశించును.

చింతా— ఆహా! బిల్వమంగళమూర్తి యెడఁబాటొక్కదినమునకే యుగప్రాయమైపోయినదే! నేనీవియోగబాధ నెట్లు భరింపఁగలను? ఆప్రేమస్వరూపునిఁ జేతులార నేనే యవలకుఁ ద్రోసి గృహకవాటములన్నియు మూసివైచితిని. లేకున్న నా కిట్టి పాటు గలుగకుండును గదా!



అక్కటా! నే నేమి సేతును! ఇప్పటికే "చింతామణి, మహాశాంతమూర్తి యగుబిల్వమంగళుని దన వశము జేసికొన్న" దనులోకాపవాదమును విన సహింపశక్యము గాకున్నయది. దీనికిఁదో డాతఁడు పితృకర్మ గూడ జేసికొనన నిక్షేపింప నిఁక నా బ్రదుకడుగవలయునా? లోకులు మఱింత తాడి పోతురు. పోనిమ్ము! దానికేమి? సర్వమంగళా దేవి యైనను సత్యము గ్రహింపలేదే! తన భర్తకు "సర్వకాల సర్వావస్థలందును నన్నే గని పెట్టుకొని యుండుమని బోధించితినా? అయ్యో! ఎంత సూక్ష్మముగ నిందారోపణము జేసినది! తనయెడ నా కెట్టి భక్తివిశ్వాసము లున్నవో, ఎట్టి గురుగౌరవము గలదో, యించుకంతయు నామె యాలోచింపలేదు గదా! అన్నా! ఆ సాధ్వీలలామ- ఆ పవిత్రచరిత్ర-ఆ భర్తృసేవాపరాయణ— దూరాలోచనము లేక యిట్లనవచ్చునా? నే నిట్టి పాతకమున కొడిఁగట్టుకొనుదాననా? రౌరవాదినరకములకుఁ ద్రోవచేసికొనుదాననా! ఆహా! బిల్వమంగళా! నన్నిందులకు రవ్వబెట్టించెదవు!

"గీ. అగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టిసతిని
దైవసాక్షిగఁ బ్రేమించుతరుణి నన్ను
నొక్కపోల్కిని మదినెంచి యుక్తరీతి
నేలికొనఁదగు శ్రీకృష్ణలీలఁ బూని."

అని మన ప్రథమసమావేశసమయమున వర మడిగియుంటిని గాదా! అయ్యది వృథ సేసి నన్నిందులకు లోకాపవాదమునకు గురి సేసెదవు? నా ప్రార్థన మంగీకరించిన నన్నియుఁ జక్కఁబడునే! నే నాఁడుదానఁ గావున నీపై మోహ ముండుట సహజము-కాని, యర్ధాంగికంటె నధికురాలనా? ఈ దోష మంతయు నీ వికటప్రవర్తనములో నున్నది. నీమూలముననే నాకిట్టి రవ్వ వచ్చుచున్నది. అం

తియేకాని, యే దోష మెఱుఁగనియమ్మకు-ఏ పాప మెఱుఁగనిపుణ్య రాశిని-చెప్పుడుమాటలు విని దూఱుచుంటిని గదా! చెప్పుడుమాటలు చెడ్డ వనుమాట నిజమే. అక్కటా! దైవమా!

[తటాలున బిల్వమంగళుఁడు రక్తవస్త్రములతో ప్రవేశించును.]

బిల్వ—ప్రాణేశ్వరీ! సుఖముగ నుంటివా? ఈప్రళయమునకు భీతిల్లలేదు కదా!

చింతా—(ఆశ్చర్యమునటించి)అయ్యో! ఇదేమి? ఈ రక్తస్రావ మెందులకుఁగలిగినది?

బిల్వ—(శరీరముజూచికొని)ఇదియా! ఇది మఱేమియునుగాదు-శత్రురక్తము!

చింతా—అనఁగ?

బిల్వ—నాకు శత్రుస్థాన మగుగోపాలశర్మయొక్క రుధిర మని యర్థము. తెలిసినదా?

చింతా—ఇంకను విస్పష్టముగ బోధపడలేదు.

బిల్వ—గోపాలశర్మ నాపైఁ బగ సాధింపఁదలంచినట్లు నీవు వినియుంటివి గదా!

చింతా—గ్రామవాసు లందఱెఱింగినవిషయమే. తరువాత?

బిల్వ—నీ వీ తుపాను కేమి భయబడియెదవో యని నేను బయలుదేరి వచ్చుచుండ గోపాలశర్మ మార్గమధ్యమున గాచి నన్ను గట్టిగఁ బట్టుకొనియె. అప్పుడు నా ప్రాణసంరక్షణార్థ మై ధరించిన కైజారుతో నాతనిం బొడిచివైచితిని.

చింతా—అయ్యయో! ఎంత ఘోరము! శత్రువును సామోపాయమున స్వాధీనముజేసికొన ధర్మము గాని, కరవాలముతో ఖండింపఁ దగునా?



బిల్వ—ప్రాణముమీఁదికి వచ్చినప్పుడు ప్రబలశత్రునితో సామోపాయ మేమి లాభము?

చింతా—ఈ గాఢాంధకారములో నాతఁ డని మీ రెట్లు గుఱితించితిరి?

బిల్వ - నా ప్రాణమున కాతఁ డొక్కఁడే శత్రువుగాని, మఱెవ్వఁడును లేఁడు.

చింతా — అదేమో చూచి వత్తము రండు.

[ఇరువురుఁ గరదీపికతో నిష్క్రమింతురు.]

---

నాల్గవరంగము—రాజవీధి.

---

(సర్వమంగళ నేలపైఁ బడియుండును)

(చింతామణి బిల్వమంగళుఁడు ప్రవేశింతురు.)

బిల్వ—(సర్వమంగళను గుర్తించి) ఆఁ! - ఏమీ! అర్థాంగి యేనా? - సర్వమంగళయేనా?—చేతులారఁగ నేనేజంపుకొంటినా?—సాధ్వీలోకమునకుఁ బంపివైచితినా? హా! హా! (మూర్ఛిల్లును)

చింతా—(దుఃఖాశ్చర్యములునటించి) అయ్యయ్యో! ఏమి యీ చిత్రమరణము! ఈమె యిందుల కెట్లు వచ్చినది? మృత్యుదేవతయే త్రోవచూపినదికాఁబోలు! ఆహా! ఇదియే నాకు సోమగిరియోగీంద్రులు పెట్టిన గడువుదినమైయుండును. ఇఁక నిలువఁ

దగదు. కాని, ముందీతనినించుక సేదఁదీర్చి సోమగిరీంద్రుని యాదేశ మునివేదింతును. అయ్యా! పండితశిఖామణీ! మీవంటి సర్వజ్ఞులిట్లు విచారింపదగదు లెండు

బిల్వ—(మెల్లగ లేచి) చింతామణీ! నేటితో నావంశ మంత మొందినది. ఇఁక నే బ్రతికియున్నను జచ్చినవానితో సమమే. నేను ఘోరపాపుఁడను- అర్ధాంగి నేడ్పించిన యధమాధముఁడను —

చింతా—అయ్యా! మీకీయజ్ఞానమేమి? మిమ్ము నిందించు కొన్నచో, మరణించినభార్య సంతసించునా, లేచివచ్చునా? పురాకృత మెంతకలదో, అంతయు ననుభవింపవలసినదే- ఆమె పతివ్రత కావున, మీచేతులందే ప్రాణమువిడిచి యుత్తమగతి కేగినది.

బిల్వ—నిజము—నిజము--ఉత్తమగతి కేపోయినది. నాకుమాత్ర మధోగతి సంభవింపక తప్పదు—ముమ్మాటికిని దప్పదు—

చింతా—అయ్యా! ఎంతసేపు విచారించిన నేమి లాభము. నేఁటితో మనకిరువురకును నైహికభోగములన్నియు నశించినవి. కావున నీసమీపముననున్న కొండగుహలో నొకయోగీశ్వరుడు కలడు. వారికడకుఁ బోయినచో ముక్తిమార్గమునకుఁ ద్రోవచూపుదురు. నేను నచ్చటకుఁ గొలఁది దినములలో నే వత్తును. మీరు ముందుగ దయచేయుఁడు. లెండు.

(బిల్వమంగళుని చేయిపట్టుకొని వెడలును)

---



అయిదవరంగము—వేశ్యవాటిక.

—:o:—

(చింతామణి యోగినీవేషమున ప్రవేశించును.)

చింతా—

శ్లో॥ భజగోవిందం భజగోవిందమ్!
భజగోవిందం మూఢమతే।
సంప్రాప్తే సన్నిహితే కాలే।
నహి నహి రక్షతి డుకృఙ్ కరణే॥ భజ॥

శ్లో॥ మూఢ జహీహి ధనాగమతృష్ణామ్।
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణాత్।
యల్లభజే నిజకర్మోపాత్తమ్।
విత్తం తేః వినోదయచిత్తమ్॥ భజ॥

శ్లో॥ నారీస్తనభరనాభీదేశమ్।
దృష్ట్వా మాగా మోహావేశమ్।
ఏతన్మాంసవసాదివికారమ్।
మనసి విచింతయ వారం వారమ్॥ భజ॥

శ్లో॥ నళినీదళగతజలమతితరళమ్।
తద్వజ్జీవిత మతిశయచపలమ్।
విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తమ్।
లోకం శోకహతం చసమస్తమ్॥ భజ॥

శ్లో॥ యావత్పవనో నివసతి దేహే।
తావత్పృచ్ఛతి కుశలంగేహే।
గతవతి వాయౌ దేహాపాయే।
భార్యా బిభ్యతితస్మిన్కాయే॥ భజ॥

చీ! చీ! మూఢులారా! అస్థిరంబు లగునిహభోగంబులందవి లిశాశ్వతానందసౌఖ్య మేల నాశనము జేసికొనియెదరు! ఇంకనైన మీ దుర్వృత్తుల విసర్జించి, కులగౌరవములఁ బ్రతిష్ఠించుకొనుఁడు. శ్రీ శంకరభగవత్పాదు లొసంగిన జ్ఞానబోధామృతమును గ్రోలి మీ మీ రక్తనాళములఁ బ్రవహించు విషరక్తమును హరింపఁజేసికొనుఁడు. మీ తనువుల నాశ్రయించియున్న వ్యసనపిశాచములను మారణహోమముం జేసికొనుఁడు. (వినుటను నటించి) ఆఁ! ఏమనుచుంటిరి? "వారకాంతకీ వైరాగ్యమును, జ్ఞానమును నెందుండివచ్చిన" వనియా? బాగు బాగు! మంచి ప్రశ్న వైచితిరి. నే నిప్పుడు మీకుఁ బ్రత్యుత్తర మిచ్చుటనవసరమేగాని, నేను వేశ్యమాతచేఁ బెనుపఁబడినందున నా విశ్వాసమామెయెడఁ జూపింప నే నిప్పుడు చెప్పవలసివచ్చిన దిటు వినుఁడు.

సీ. అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన సతులుండ
పరభామలను గోరు పందలార!
గృహదీపికలఁబోలు గృహిణులుండఁగఁ బాడు
కొంపదూరెడు వెఱ్ఱికుంకలార!
పతిదైవతంబంచుఁ బ్రణుతించుసతులుండ
నన్యకాంతల మ్రొక్కు నధములార!
పంచభక్ష్యములిచ్చు భామలుండ మఱొక్క
కంపునోటిని గోరుకఠినులార!

గీ. చదువు సంధ్యలు నట్టేట జారవిడచి
వంశమర్యాదలను నెల్ల భ్రష్టుజేసి
దేశభాషలకు న్ముప్పు దెచ్చిపెట్టి
బ్రదుకుచుంటిరి జీవచ్ఛవంబులగుచు.



ఆ. కనులు నెత్తికెక్కి కామాంధులై కన్ను
మిన్ను గానకుండ మెలఁగుచుండి
కాని, యెన్నఁడైనఁ గనుగొంటిరే మీదు
యిండ్లలోన జరుగు హేయములను.
నాదు పుట్టు వెన్ని నగుబాట్లు కలదొక్క
యోజసేయుఁ డాత్మ నొక్కమారు
తప్పులెల్ల మీరె దాఁచుకొంచును పైగ
సాన్ల కొంప దీయసాగినారె?

ఓహోరి గోముఖవ్యాఘ్రములారా! గణికాకులోద్యానమునకుఁ గాల్చిచ్చులై తిరిగదా! చీ! చీ! మీకంట్ల కావరమునకుఁ గాలపాశ మెదురు చూచుచున్నది లెండు.

[బిల్వమంగళుఁ డీ క్రిందిపద్యముఁ జదువుచుఁ బ్రవేశించును]

శ్లో॥ చింతామణిర్జయతు సోమగిరిర్గురుర్మే
శిక్షాగురుశ్చ భగవాన్శిఖిపింఛమౌళిః
యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు
లీలాస్వయంవర రసం లభతే జయశ్రీః

తల్లీ! చింతామణీ! నీకరుణాకటాక్షమున నస్థిరంబులగు నిహభోగములం బరిత్యజించి బ్రహ్మానందసుఖమును బొలుఁగొంటిని.

(చింతామణి పాదములఁబడును.)

చింతా—మహాభాగా! ఏమి యీ యకార్యకరణము! లెండు లెండు! (లేవనెత్తును)

బిల్వ—చింతామణీ! నీవు నన్నుద్ధరింపఁజేయ సాక్షాత్కరించిన పరదేవతవు గాని, సామాన్యవు గావు. నీ మహిమ మెఱుంగలేక మాయామోహితుఁడనై పోయితిని. నా యపరాధముల క్షమింపుము.

చింతా—అయ్యా! కర్మపాశమునకుఁ గట్టువడని ప్రాణికలదా? ఇందు మన యత్నమేమున్నది? సర్వమునకును దైవమే సాక్షీభూతుఁడు. ఇఁక మనచరిత్రమును ముగించి సోమగిరీంద్రుని సేవింపఁ బోవుదము రండు.

బిల్వ—అవును; నిజమే. మనమీ ప్రపంచరంగమునఁ బ్రవేశించినది మొదలతిసూక్ష్మముగ—అతినిగూఢముగ-- మనజన్మకథనమును లోకమునకుఁ బ్రదర్శించితిమి. ఇఁక నింతతో నైహికకథను ముగించి భరతవాక్యమున కుత్తరరంగమునకుఁ బోకున్న జనులు విసుఁగుజెందక మానరు. అయిన నీ పురవాసుల కొక్కటి మనవిచేయవలసియున్నది. ఓ యయ్యలారా! బ్రాహ్మణశ్రేష్ఠులారా! మిమ్ము దోసిలొగ్గి ప్రార్థించుచుంటి నిటువినుఁడు.

సీ. ముకుపచ్చలారని ముద్దుకన్నెల గొంతు
  గోసి వృద్ధుల కేల కూర్తు రయ్య?
మనుము లెన్మిది యైన ధనవంతుఁ డైనచోఁ
  దగినయల్లుఁడె? మీకుఁ దాతగారు
చదువుసంధ్యలు గల్గి చట్రాతిమగఁడైన
  సుఖయింపఁగల్గునే? సుందరాంగి
కన్నబిడ్డల ప్రేమ గంగపాల్జేసి, మా
  ర్మనుము కై యారాటపడఁగ నేల?
గీ. పెండ్లిపీఁటను బ్రాణము ల్వీడుచు నొకఁడు
విటునిమరఁగినభార్యచే వేఁగు నొకఁడు
పుట్టిపెఱిఁగిన పట్టి గోల్పోవు నొకఁడు.
మానుకొనుఁడయ్య యిఁకనైన మారుమనుము.



మఱియును,

గీ. పతి గతించిన వేఱొక్క సతిని బురుషు
లేమికతమున జేపట్ట నోచవలయు?
పతి గతించిన నింకొక్క పతిని సతులు
బెండ్లి యాడుటఁ దగదొక్కొ? పెద్దలార!

చింతా—అయ్యా! మీకీ వెఱ్ఱియేమి? చెవిఁటివానియొద్ద శంఖమూఁదిన నెంతయుపయోగమో, యీ పశుప్రాయులయొద్ద మీ హితోపదేశమంతె యుపయోగము.

బిల్వ—అయ్యో! వెఱ్ఱిదానా! లోక మంద ఱొక్కరీతిని నుందురా? వివేకులుందు రవివేకులుందురు—జ్ఞానులుందు రజ్ఞానులుందురు—అసూయాపరులుందు రనసూయాపరులుందురు-త్రాఁగుఁబోతులుందురు; తత్త్వవేత్తలుందురు-ఇంత బ్రహ్మజాతిలో, నా తత్త్వముం దెలిసికొని, నన్ననుసరించువాఁ డొక్కఁడైన నుండకుండునా?

చింతా—ఇది స్వానుభవమున దెలియఁదగినవిషయముగాని మీ హితవాక్యములచేఁ జక్కఁబడునదికాదు. అదిగో! ఆప్రక్కం జూడుఁడు. కొందఱుపెద్దలు కను లెఱ్ఱజేయుచున్నారు- మఱికొందఱు మూతులు త్రిప్పి ముక్కులు విఱచికొనుచున్నారు. ఇంకనుకొంద ఱశాస్త్రీయమని గుసగుస లాడికొనుచున్నారు-ఎందుకీ కంఠశోషణము!

బిల్వ—అయ్యలారా! మీ రేమియుఁ గోపింపక నా ప్రార్థనముం దుదముట్ట నాలకింపుఁడు.

గీ. ప్రేమమయుఁ డీశ్వరుఁడు సృష్టి ప్రేమమయము
ప్రేమమే ప్రాణిజాలంబు ప్రేమ జగతి
ప్రేమ ముత్తమధర్మంబు ప్రేమ మఖిల
వేదశాస్త్రపురాణార్థభేషజంబు.

కావున, నోమహనీయులారా! మన సంఘదురాచారముల నణగఁద్రొక్కి, జాతీయగౌరవములం గాపాడి, మహాపాతకభూయిష్ఠములగు నీవికటవివాహపిశాచముల మారణహోమముం జేసి శాశ్వతానందసుఖప్రదంబు లగుస్వయంవరవివాహాచారముల నవలంబింపుఁడు. అట్లయినచో స్త్రీపురుషులలో నెవ్వరికైనను మార్గమునుపై మనసు బోవునేమో యోజించుకొనుఁడు. చేతులార యీ ప్రేమప్రవాహము నరికట్టి విషసాగరమునకేల మరలించెదరు? అప్పు డీ వృద్ధవివాహములుగాని, విశంతూద్వాహములుగాని, భ్రూణహత్యలుగాని, నరహత్యలుగాని, యెందైన జూపట్టునా? దీనికి శాస్త్రవాదము లవసరము లేదు—సంఘసంస్కరణసభ లవసరము లేదు. దేశకాలపాత్రల ననుసరించి వర్తించుటయేమహాత్సాధనము మీరేమియు నలుక వహింపక నాకు సెలవొసంగి యిదే భరతవాక్యముగ గ్రహింపుఁడు.

శ్లో॥ అగ్రే దీర్ఘతరోయ మర్జునతరు స్తస్యాగ్రతో వర్త్మనీ
సా ఘోషం సముపైతి తత్పరిసరే దేశే కళిందాత్మజా
తస్యా స్తీరతమాలకాననతలే చక్రం గవాం చారయన్
గోపః క్రీడతి దర్శయిష్యతి సఖే పంథాన మవ్యాహృతమ్.

[ఇరువురు నిష్క్రమింతురు.]

---

ఆఱవ రంగము—సోమగిరి మఠము.

---

(సోమగిరి, కమల, మఱికొందఱు సన్యాసులును తత్త్వగీతములు పాడుకొనుచుందురు.)



(బిల్వమంగళుఁడు, చింతామణి యీక్రిందిశ్లోకములఁ బఠింపుచుఁ బ్రవేశింతురు.)

బిల్వ—

శ్లో॥ బాలోపి శైలోద్ధరణాగ్రపాణి
ర్నీలోపి నీరంధ్రితమః ప్రదీపః
ధీరోపి రాధానయనావబద్ధో
జారోపి సంసారహరః కుత స్త్వమ్॥

చింతా—

శ్లో॥ వయసి గతే కః కామవికార
శ్శుష్కే నీరే కః కాసారః
క్షీణే విత్తే కః పరివారో
జ్ఞాతే విత్తే క స్సంసారః॥ భజ॥

(సోమగిరియోగికి నమస్కరింతురు.)

సోమ—వత్సే! ఈమెయే నీ మాతృదేవత. ముందామెను నమస్కరింపుము.

చింతా—(కమలకు నమస్కరించి (కౌఁగిలించును)

కమల—(చింతామణిని కౌఁగిలించి) అమ్మా! తిరిగి నిన్నింతకాలమునకుఁ జూడగంటిని! సేమముగ నుంటివా?

చింతా—గురుకటాక్షమున సేమంబుండుటయేగాక నిన్నుఁ జూచుభాగ్యముంగూడ బడసితిని.

సోమ—బిల్వమంగళా! నీవు శ్రీకృష్ణభక్తుండవుగావున, లోకగ్రహార్థమై శ్రీకృష్ణకర్ణామృతమనుగ్రంథరాజమును రచించి శ్రీకృష్ణలీలాశుకుం డను నామధేయముం బొందుదువుగాక! నీకికే దేని యభీష్టమున్న దెల్పుమొసంగెదము.

బిల్వ—అయ్యా! నాసోదరి చారుమతి సేమముం దెలిపినఁ జాలును.

సోమ—అబ్బా! అసాధ్యపుఁగోర్కెఁ గోరితివి కదా! అదిప్పుడు చెప్పవీలులేదు. నీచరిత్రమువలె నాబాలిక చరిత్రముగూడ నింకొక నాటకరాజముకాఁదలఁచి యున్నది. నీచరిత్రము వ్రాయు నాతఁడే యామెచరిత్రముగూడ దృశ్యప్రబంధరూపమున నే లోకమునకు వెల్లడింపఁ గలఁడు.

చింతా—గురూత్తమా! ఈ శ్రీకృష్ణలీలాశుకయోగీంద్రుని జన కులవృత్తాంత మెందును వినఁబడ దేమి కారణము?

సోమ—మహాత్మునకు వానికూరు పేరు లెట్లుండును? అట్టివానిం దలంచినచో మహాపాతకములుఁ గూడ సంభవించును; పోనిమ్మా ప్రశంస యటుండనిచ్చి, నీకేదైన వాంఛిత మున్న దెల్పుము.

చింతా—ఏ సాధ్వీరత్నము, నా మూలముగఁ దన ప్రాణములం గోల్పోయెనో ఆపతివ్రతాశిరోమణియగు సర్వమంగళాదేవి సందర్శనభాగ్య మొనగూర్తురుగాక!

సోమ—(మంత్రోదకములతో చింతామణీలీలాశుకుల కన్నులందుడిచి) అదిగో! నభోమార్గమున నవి మానముపై సాధ్వీలోకమున కేగుచున్న దటు చూడుఁడు.

(సర్వమంగళ విమానమున గనఁబడును.)

చింతా—బిల్వ—హా! హా! హా!

సోమ—అజ్ఞాన మజ్ఞానము.

(తెరపడును.)



ఈపాటలు బ్ర. శ్రీ. బ్రహ్మజ్యోస్యుల సుబ్బారావుగారిచే రచియింపఁబడినవి.

శుభమస్తు.

—:ప్రార్థన:—

మోహన జంపె తాళము.

1 శ్రీ రుక్మిణీనాథ శ్రితజనా శ్రితలోల
కారుణ్యమున మమ్ముగాపాడుమో దేవ॥శ్రీ॥
అనయంబు నిన్మదిని ఆశ్రయించెదమయ్య
ప్రణుతోస్మి ప్రణుతోస్మి ప్రభో కృష్ణమోహనా॥శ్రీ॥

4వ పేజి 15వ పంక్తి తర్వాత.

కాఫి డైలాగ్ ఆది.

2 తెలిసెనీదు మాయలిప్పటికి తొలగిపొమ్ము
నాదరికిక రాకుము॥తెలిసె॥
ఇట్టివాడవని ఎరుగనైతి నీ విట్టిబూట
కము లిక చాలింపుము॥తెలిసె॥
కలికి నీవిటుల బలుకగదగునే కరుణ
మీరఁగ గావవేడెదనె॥కలి॥
ఇలనీకిన్నఁగ గలదేవేరె చలముమానిఁగ
పాలింపగదే॥కలికి॥

6వ పేజి 9వ పంక్తి తర్వాత.

కన్నడ చతురశ్రగతి.

ఎటులా వీడి చనెదఁ యీ కూనన్
కటకటా ఎంతటి కఠినత బూనితిఁ॥ఎటు॥
కడుపారగ గని కడకు నేనీగతిఁ విడిచి చనగనా
విధితలవ్రాసెనా గడువగ శక్యమే కర్మఫలమునిలపై॥ఎటులా॥

17వ పేజీ 6వ పంక్తితరువాత.

4 గోపాలుడు—

మాండ్, ఆది.

ఎంతటి జంతలో యీ యిలపై స్త్రీలహాహా
కంతుడైనమా కాంతుడైనయీ
కాంతలమనములగాంచగ గలరే॥ ఎంత॥

సాకీ= ఆహా సుంతయైన లోకరుణదలుపక
యీ సుదతియం పెగద కేదారములకితనిపై కినుక
హా పుత్రిసముడగునీతని పుణ్యపురుషు సుగుణవంతుని
శత్రువో లెమదినెంచెను చెనటికపట ప్రేమతోడ॥ ఎంతటి

26వ పేజీ, 9వ పంక్తితర్వాత.

సుందరుడు.

భీంపలాస్, మిశ్రగతి.

5 అకటా ఎంతటీ ఘోరము మదినెంచెనో దైవమా
1 ఏపాపమెఱుగన్ మరేకర్మమెఱుగక యీ
పాపి నాపైని కోపం బదేలక॥ అకటా॥
2 పినతల్లియంచుక మనంబందునెంచక
ననుజంప దోసంబు నేనేమి జేసితి॥ అకటా॥

29వ పేజీ, 2వ పంక్తితర్వాత.

సుందరుడు.

అసావేరి త్రిశ్యగతి.

6 పరమపురుష దీనబంధూ ప్రాపునాకు నీవే దేవ॥ పర॥
కరుణమాపి తల్లినన్ను పరునిగ దలపోసెనకటా॥ పర
ఏమిసేతు నెందుబోదు ఎవరుదిక్కు నీకన్నక
కామితఫలదాయకనక కరుణతోడ బ్రోవుమయ్యా॥
చింతామణి కృష్ణవిగ్రహముతో బ్రవేశించుచున్నపుడు,

# అనసూయ

(అయిదంకముల నాటకము.)

సుమతీ, అనసూయాసతీమణుల పాతివ్రత్యప్రభావము చ
హృదయరంజకముగ వ్రాయబడినది. వేశ్య చెప్పిననీతులు వినితీరవ
నారదునికలహాసంధానమే నాటకమునకు మూలసూత్రము—నార
కథానాయకుఁడని చెప్పవచ్చును. (చక్కని పార్శీ పాటలు గలవు)

వెల పోస్టేజిగాక రు. 0—12—0.

## కీచకవధ.

——:0:——

ఇది శృంగారరస ప్రధానమైన నాటకము. ఇందు కీచకుని
మోహము, తన్మూర్ఖత్వము, సైరంధ్రి యాందోళనము, గుండె చలిం
చేయునట్లుగా వ్రాయబడినవి. ప్రతిపుట అమృతరస మొలుకుచ
నన్న మాట అతిశయోక్తి కాదు. వెల రు. 0—12

బ్రహ్మశ్రీ చక్రవధానుల మాణిక్యశర్మగారిచే
రచియింపఁబడిన నాటకములు.

## సంపూర్ణభారతము.

——:0:——

(పార్శీమట్టులతో ముద్రింపఁబడిన నాటకము.)

పాండవధార్తరాష్ట్రుల ధనుర్విద్యాభ్యాసము, లాక్షాగృహదహ
నము-బక, హిడింబాసురవధ-ద్రౌపదీ స్వయంవరము-సుభద్రా
ణయము. పాంచాలీపరాభవము, కృష్ణరాయబారము, పద్మవ్యూహ
ము, మొదలగు నన్నివిషయములును సంగ్రహముగ జేర్చి వ్రాయ
బడినది. వెల రు 1—4 0.

---

ప్రొప్రయిటరు, గోదావరీబుక్కుడిపో, రాజమండ్రి.

